# భారతి

సాహిత్య మాసపత్రిక

నవంబరు 1990

వెల : 5 రూపాయలు



- సాంధ్యశ్రీ "మబ్బులు"
- సోమసుందర్ "ఘంటారావం"
- పురిజాల "పంచమా శిల్పం"
- [illegible] నా ప్రజలు
- తొలి తెలుగు అధిక్షేప నవల
- [illegible]

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 67 | నవంబరు 1990 | సంచిక : 11

విడి ప్రతి వెల ఐదు రూపాయలు


## విషయానుక్రమణిక

# స్వవిషయం

భారతి పునరాగమనానికి స్పందించి ఎంతోమంది శ్రేయోభిలాషులు తమ సంతోషాన్ని ప్రకటిస్తూ ఉత్తరాలు రాశారు. వారి కందరికీ భారతి పేరు పేరునా కృతజ్ఞతా పూర్వకంగా వినమ్రాంజలిని సమర్పించుకుంటోంది. ఇటువంటి సహకారాన్నే ఎప్పుడు ఆశిస్తూ భారతి తన వంతు సేవను కృషి వంచన లేకుండా నిర్వర్తించడానికి సిద్ధంగా ఉంది. ఇందుకు రాసేవారి, చదివేవారి తోడ్పాటు ఎంతయినా అవసరం.

తొలి తెలుగు అధిక్షేప నవలకు శ్రీకారం చుట్టినది కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారని శ్రీ రెంటాల వివరిస్తున్నారు. విమర్శకులు దీనిని ఎలా పరిగ్రహిస్తారో వేచి చూడాలి.

శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి "నా దేశం నా ప్రజలు" వచన కావ్యం ఒక ఆధునిక ఇతిహాసమని డా॥ పెన్నా శివరామకృష్ణ అభిప్రాయపడుతున్నారు. ఈ కావ్యాన్ని ఎంతోమంది ఎన్నో భాషల్లోకి అనువదించారు. చివరికి గ్రీకు కవయిత్రి జార్జియా అలెక్సియో ఈ కావ్యాన్ని గ్రీకు భాషలోకి కూడా అనువదించారని వింటుంటే ఈ కావ్యం ఎంత విశిష్టమైందో అవగాహనకు వస్తుంది.

ఈ సంచికలో అందిస్తున్న కవిత్వం రకరకాల భావాలను వెల్లడిస్తూ భారతి ప్రదర్శిస్తున్న సమన్వయ దృష్టికి సంకేతంగా నిలుస్తుంది.

కథలను ఎక్కువగానే ప్రచురించాలని అనుకుంటున్నప్పటికీ తగిన స్థాయి గల కథలకు కొరతగానే ఉన్నట్లు తోస్తోంది. కథలను పండించే సాహిత్య కృషీవలురు ఈ విషయం గురించి ఆలోచించగలరని భారతి ఆశిస్తోంది.

కలగూరగంపలో వైవిధ్యం పుష్కలంగా ఉండేలా చూడడమే కాకుండా విమర్శకు తగినంత తావును కూడా అందించడానికి భారతి ప్రయత్నిస్తోంది. గ్రంథవిమర్శల విషయంలో కూడా ఏమాత్రం జాప్యం లేకుండా ఏ నెలకు ఆ నెల విడుదలవుతున్న గ్రంథాల గురించి కూలంకషంగా కాకపోయినప్పటికీ కనీసం స్థూలంగానైనా సమీక్షలను అందించడానికి తగిన చర్యలు తీసుకుంటున్నట్లు భారతి సవినయంగా తెలుపుకుంటోంది. ఇందుకు అందరి దగ్గరనుంచి ప్రోత్సాహం లభించగలదని మనస్ఫూర్తిగా నమ్ముతోంది.

# మబ్బులు

## సాంధ్యశ్రీ

కొండ కొమ్మున నిలచి తుండ మెత్తిన మబ్బు
గాలి తాకుకు కదలి నింగిపై పొరలింది
ఎండ కాగిన నేల గుండెపై గొడుగెత్తి
పిల్ల తెమ్మెర నంత పిలచికొని వచ్చింది....

మబ్బు సాగిన నీడ మెత్తగా పొలచింది
దబ్బు దబ్బున గాలి బుగ్గుబ్బరించింది
చలిగాలి నేలనే వెనుదట్టి పిలిచింది
చిలింత చినుకులను ఒడిగట్టి చూపింది

మబ్బు లాకస వీధి నిబ్బరించిన వేళ
చినుకు ముత్తయ మొకటి నేలబడి రాలింది
బుగల ఆవిరియైన సన్న పొగ తీగగా
చినుకు నవ్వులు తా సొట్టపడినద బుగ్గ....

మేను విరిచిన గాలి మలక హాయ సాగగా
అటు మబ్బు పెరిగింది అవనిపై వాలగా
చినుకు రాలినచోటు చిత్తడుల పస మీరి
గప్పుమని వాసనలు ఇప్పతిల్లిన వంత....

చిలకరించిన వాన చినుకులకు పులకించి
తలపు తట్టులనెత్తు మొక్కలే చిగురించె
తొలుత వచ్చిన చిగురు చేతులను జోడించి
దణ్ణ మెట్టిన తీరు ధరణి తొలి చదువుగా....

నీటి చలమల పొదు నింగిలో తోచినది
ఏరి నీటను మునిగి తడిసి వచ్చినవేమొ
పట్టు మబ్బులు కొన్ని పట్టుకొచ్చిన నీరు
పన్నీటి జల్లుగా పలుకరించిన వోయి....

ఎన్ని మబ్బులు చేరి వితాము లెత్తెనో
కూడి బీటల నేల దప్పికను చల్లార్చి
జల జలా జల జలా జల్లులో జల్లులు
వెల్లువై పెల్లుగా పల్లవుల అల్లరులు....

పిలుపు చేరని మబ్బు వలపు తీరని మబ్బు
చినుకు పూవుల మబ్బు చెణకు మెరుపుల మబ్బు
కోపాన నొక మబ్బు తాపాన నొక మబ్బు
తిరుగాడు నొక మబ్బు ఒలకబోసిన వలపు....

మెరుపు తీవెల తళుకు ఛాయ వన్నెల కులుకు
తళ తళలు మోసింది చినుకు చినుకు సందు
చినుకు తెలిముత్యమో ముత్తియము తెలిచినుకో
ఆకు కొనలో నిలచి హరివిల్లు పొదిగింది....

శిలలపై నొక మబ్బు చిమ్మిపోయిన నీరు
మబ్బు గుండియలోని మంచితన మేను
కొమ్మపై నొక మబ్బు కుమ్మరించిన నీరు
పొదరిల్లు హరివిల్లు పూత కొరకేను....

వెచ్చ యూరుపుతోన చిచ్చు మోసిన మొక్క
సిగను పూవుల సిరుల చెండులను చుట్టి
నేల ఎండిన వడియ నీటి అద్దము లోన
సోకు చూచుకొనుచు నుంత మురిసింది....

శివ జటా జూటాన సురగంగ సుడులేవొ
మబ్బు చీకటి దారి మెరుపు తీగల మీటి
ఫెళ ఫెళా జల జలా ఫణితి తాండవకేళి
శిర మొంచెనా శివుడు - శివమెత్తగా గంగ....

డా॥ ఎం. హనుమంతప్ప

# బుద్ధన్న కవితా బుద్ధి

బుద్ధి - అన్న పదానికి ఆలోచన, తలపు, మనసు, ప్రతిభ జ్ఞానము అనే అర్థాలున్నాయి. ఈ అర్థాలే కాకుండా వేదాంత శాస్త్రంలో బుద్ధి అన్నది అంతఃకరణ వృత్తులు నాల్గింటిలో ఒకటి. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఈ నాల్గింటిని 'అంతఃకరణ వృత్తులు' అంటారు. వాటిలో బుద్ధి - వంద, మేధ, ప్రౌషి, ధార్వి, గృహీతి, చత్వరి అని ఆరు భేదాలు కలది. దీనికి క్షయము కలిగించేవి శోకము, క్రోధము, లోభము, కామము, మోహము, పరాసుత, ఈర్ష్య, మానము, విచికిత్స, హింప, అసూయ, జుగుప్స అన్నవి. [చూ. శ్రీ సూర్య రాయాంధ్ర నిఘంటువు - అయిదవ సంపుటము - 1982]. ఇక కవి పేరు బుద్ధన్న. బుద్ధుడు అంటే మేలుకొన్నవాడు, జాగరితుడు. తత్వజ్ఞానంతో లోకులకు తత్వజ్ఞానం బోధించేవాడు. ఇది 'ఆత్మోపశమనము' అన్న కవితలో కనిపిస్తుంది. ఒకరకంగా 'అక్షర వైజయింతిక, మాన్య స్మృతి' అన్న కవితా ఖండికలలో కూడా కనిపిస్తుంది. మానవుడు ఒకరి నుంచి సహాయం పొందిన తర్వాత వారిపట్ల కృతజ్ఞతాభావాన్ని కల్గి ఉండాలన్నది తనకే (కవికే) కాదు - మానవు లందరికీ అది వర్తిస్తుంది. ఇది మనకు 'మాన్య స్మృతి, అక్షర వైజయింతిక' అన్న కవితా ఖండికలలో ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా కనిపిస్తుంది. ఈ విధంగా తత్వజ్ఞానాన్ని బోధించిన బుద్ధన్న పేరు అక్షరాలా సార్థకమైంది.

పై అర్థాల నన్నిటిని దృష్టిలో పెట్టుకొని 'బుద్ధన్న కవితాబుద్ధి' అన్న శీర్షికతో ఈ వ్యాసాన్ని వ్రాస్తున్నాను. బుద్ధన్న రచించిన 'రాగకింకిణి' అన్న కవితా సంపుటిని ఆధారంగా బుద్ధన్న కవితాబుద్ధిని పరామర్శించడం ఈ వ్యాసోద్దేశ్యం.

ఈ సంపుటిలో పద్నాలుగు కవితా ఖండికలున్నాయి. పద్యాల రచన అంతరిస్తున్న ఈ రోజుల్లో బుద్ధన్నగారు తన భావాలన్నిటిని పద్యాల్లో కూర్చి తన బుద్ధిని ప్రదర్శించుకున్నారు. డా॥ యం. బుద్ధన్నగారు ప్రతి ఖండికను రమణీయంగా సంతరించారనడంలో ఏ మాత్రమూ సందేహం లేదు. పాఠకుడు పద్యాలను (ముఖ్యంగా ఆటవెలది, తేటగీతులను) చదువుతున్నప్పుడు ఉర్దూ గజల్స్ వింటున్న లేక చదువుతున్న అనుభూతిని పొందుతాడు.

బుద్ధన్న తన కవిత్వాన్ని ప్రదర్శించిన తీరులను ఈ కింద చూద్దాం.

మాన్యజన గౌరవం :

పూర్వీకులు మన దేశానికి, మన భాషకు సేవచేసేవారు. వారిని మరచిపోకుండా స్మరించడం - 'అంబేద్కర్, స్మృతి హసంతి' అన్న ఖండికలలో కనిపిస్తుంది. నిమ్నజాతుల వారు ఆనాడు అగ్రవర్ణాల వారిచేత ఎన్ని అవమానాలు, ఎన్ని బాధలు పడ్డారో కళ్ళారా చూసినవాడు, తాను కూడా అనుభవించిన వాడు అయిన డా॥ బి. ఆర్ అంబేద్కర్ నిమ్నజాతులకు విముక్తి కలుగజేయాలని తపన జెంది, వీలయినంత సేవను వారి కందించాడు. నేడు నిమ్నజాతులవారు కొంతమంది మంచి స్థానాన్ని అలంకరించినా తోటి నిమ్నజాతులవారిని వెంటనే మరచిపోతున్నారు. మరచిపోవడ మొక్కటే కాదు - అట్టడుగున పడి ఉన్న తమ జాతివారిని దరికి చేరనివ్వడం లేదు. అలాంటి వాడు కాదు మరి అంబేద్కర్. నిమ్నజాతి అభివృద్ధి కోసం తన జీవితాన్నే అంకితం చేసిన మహనీయుడు. మహామనీషి. అటువంటి అంబేద్కర్‌గారిని మనసారా స్మరించి 'వందనోత్కరమ్ము' అర్పించుకున్నాడు కవి బుద్ధన్న.

అంధకార భూతమ్ముతో పోర
    కాంతి కిరణములకు గతులు వచ్చె
అతడు కుల మతాల పతిత లోకములోన
    చేదు మింగి స్వాదు సృష్టినిచ్చె!

అంబేద్కర్ సేవల వల్ల కాంతి కిరణాలకే గతులు (నడకలు) వచ్చాయట.

అతని వాక్కు సంకుచిత మత గజగర్వ
    మణచివైచు కర్కశాంకుశమ్ము!
అతని స్వప్నగీత మహారహమ్మును గూడ
    పంచమాభ్యుదయ విభా పథమ్ము!

సంకుచిత మతతత్వమనే గజ గర్వాన్ని అతని వాక్కులే కర్కశాంకుశమై అణచినదట.

ఈ కింది ఆటవెలదిలో అంబేద్కర్ శరీరములోని ప్రతి కణమూ విశ్వ జాతిని అభివృద్ధి పరచి వారి సుఖ సంతోషాల కోసం అంకిత మైనాయని కవిగారు అభివర్ణించారు. ఇది ఊరకే చెప్పడం కాదు - అక్షరాలా నిజమే గదా!

విశ్వజాతి ప్రగతి సత్యమ్ము కోసమై
అతని కణ కణమ్ము అంకితమ్ము!
సంకుచిత సమాజ సంఘర్షణము కోస
మతని జీవితమ్ము అంగణమ్ము!

ఆనాడు అంటరానితనం ఎక్కువగా ఉండేది. మానవులలో మానవత లోపించిందని, ఆ మానవత కోసం తపించిపోయాడు అంబేద్కర్. బుద్ధుని సూత్రాలలో ప్రథమ సూత్రమైన మానవతను ఎప్పుడూ అంబేద్కర్ కోరేవాడని కవి స్మరించాడు.

అతడు కోరు మానవత బోధిసత్త్వుని
చూపులోన ప్రథమ సూత్రమాయె!
అతని హేతువాద మాసూత్ర మార్గాన
కుసుమించి ఫలనికుంజమాయె!

మానవాళి కోసం అనేక సేవలు చేసినటువంటి అంబేద్కర్ గారిని అభినవ మనువుగా సరిపోల్చి ఆయనకు నిండు మనసుతో చేతులెత్తి నమస్కారం చేశాడు కవి

మనిషిలో మనీషి, మమతావృత మనస్వి,
భరతజాతి రత్న భాస్కరుండు!
ఆ మహానుభావు దభినవ మనువు, అం
బేద్కరునకు వందనోత్కరమ్ము.

ఆంధ్ర సరస్వతికి అపారమైన సేవలు చేసిన మహారాజా శ్రీకృష్ణదేవరాయలను 'స్మృతి హసంతి' అన్న కవితా ఖండికలో స్మరించుకున్నాడు బుద్ధన్నగారు.

కావ్యకళ, శిల్పకళ, నాట్యకళ, క్షాత్ర కళలను శ్రీకృష్ణదేవరాయలు పోషించి యుగయుగాల భోగాలన్నీ కృష్ణరాయల యుగంలోనే పునారూప మెత్తినట్లు కీర్తించి తన కావ్యకళా బుద్ధిని ప్రదర్శించుకున్నారు ఈ కింది సీస పద్యంలో.

అది కావ్యకళ పేర హృదయ సీమల మూగి
పారిజాతాదులే పారు యుగము!
అది శిల్పకళ పేర అశ్మకమ్ముల దాగి
విశ్వకర్మయె తిష్ఠవేయు యుగము!
అది నాట్యకళ పేర మదవతీ మంజీర
లయలు పొంగు రసవిలాస యుగము!
అది క్షాత్రకళ పేర పదను కత్తుల ధార
దిఙ్ముఖమ్ముల మించి తేల్చు యుగము!

యుగయుగాల భోగ యోగమ్ములే పునా
రూప మెత్తు కృష్ణరూపు యుగము!
దివికి భువికి కీర్తి దీప తోరణముగా
సతము స్మృతుల రేపు స్వర్ణయుగము!

ఆ యుగంలో దేవశిల్పి అయిన విశ్వకర్మయే రాళ్ళలో దాగి తిష్ఠ వేశాడట. ఎంత మధురమైన భావన. నిజంగా ఆ యుగంలోని శిల్పకళకు ముగ్ధుడై తన కలం నుండి జార విడిచిన భావమిది.

శ్రీకృష్ణరాయలు ఆముక్తమాల్యదను, అల్లసాని పెద్దన స్వారోచిషమను సంభవమను నామాంతరము గల మను చరిత్రమును, ముక్కు తిమ్మన పారిజాతాపహరణమును, తెనాలి రామకృష్ణుడు పాండురంగ మహాత్మ్యమును రాయగా ఈ విధంగా కలము, కలిమి ఏకం కావడంతో కల్పనా స్వర్గమై తెలుగుభాష జిలుగు లీనినదట ఆంధ్రభోజ బిరుదును అర్థవంత మొనర్చిన శ్రీకృష్ణదేవరాయలను ఎల్లప్పుడూ స్మరించకుండా ఉండలేనంటాడు మన బుద్ధన్న.

తన మనః పద్మ సద్మమున ముక్తాబైన
ఆముక్తకము పరాంధాము మిడగ
తన బాహు పరిరంభమున రంభయు గోలు
స్వారోచిషము శిరీషముల రువ్వ
తన ప్రాపులోని వైతాళికుండును భక్తి
పుండరీక సుగంధపురము లేల

కలము కలిమి యిట్లు కల్పనా స్వర్గమై
తెలుగు భాషలోన జిలుగు లీన
ఆంధ్రభోజ బిరుద మర్థవంత మొనర్చు
కృష్ణరాణ్మణిని స్మరింతు నెపుడు.

కృతజ్ఞతా బుద్ధి :

'మాన్య స్మృతి, అక్షర వైజయంతిక' అన్న కవితా ఖండికలలో బుద్ధన్న యొక్క కృతజ్ఞతాబుద్ధి స్పష్టంగా బయట పడుతుంది. అగాధమైన సుడిగుండంలో పడిపోతున్న మనిషిని ఆదుకుంటే ఎంత సంతోషపడతాడో, నిన్ను ఏమాత్రమూ లేని

ఎడారిలో చిక్కు దప్పికగొన్న మనిషికి నీళ్ళు ఇస్తే ప్రాణం లేచొచ్చేటంత - ఎంతో సంతోషపడతాడో ఆ విధమైన అను భూతిని స్వయంగా తన జీవితంలో పొందినవాడు బుద్ధన్న. తాను పి. హెచ్. డి. కోసం పరిశోధన చేసే కాలంలో తన్ను ఆర్థి కంగా, హార్దికంగా ఆదుకొన్న వారు ఆచార్య కోరాడ మహాదేవ శాస్త్రిగారు.

'అక్షర వైజయింతిక' రూపంలో మహాదేవశాస్త్రిగారి పట్ల కృతజ్ఞతాభావాన్ని వెల్లడించుకున్నారు బుద్ధన్నగారు. ఎదుటివారి కష్టాలను చెప్పకనే తెలుసుకునే గుణం ఎవరిలో ఉంటుందో వారిని సద్గురువు అనవచ్చు. ఆ లక్షణాన్ని మహాదేవశాస్త్రిగారిలో ఉన్నట్లు కవి చూశాడు. అతని చెయ్యి ఎప్పుడూ ఇతరులకు సహాయం చెయ్యడానికి ఉపయోగపడుతుంది. అటువంటి చేతిని ఈ విధంగా అభివ్యక్తీకరిస్తున్నాడు కవి.

ఎదుటి బ్రదుకులోని ముదురు చీకటినెల్ల
　　సతము శతము సేయు వ్రతము నీది!
తనువు విచ్చుకొన్న మునుదు దధీచికే
　　జీవధార లొలుకు చేయి నీది!

వజ్రాయుధం తయారీ కోసం దేవతలకు తన వెన్ను పూసల ఎముకల సమూహాన్ని అర్పించుకున్నవాడు దధీచి. ఎముకలు లేని శరీరం కూడా మహాదేవుని చెయ్యి సోకితే ప్రాణాలు పోసుకొని జీవిస్తుందట. మహాదేవుడు చేసిన సహాయానికి ఇంత కంటే చక్కని భావంతో ఎలా చెప్పడం! ఎంత కృతజ్ఞతా భావన!

బుద్ధన్నగారి కృతజ్ఞతా భావానికి మురిసి డా॥ దాశరథిగారు పీఠిక (రాగకింకిణి) లో ఇలా అన్నారు. "యేరు దాటి తెప్ప తగులబెట్టువారు హెచ్చుగా ఉన్నారు. బుద్ధన్న వంటి - గురువు పట్ల గౌరవం గలవారు చాలా అరుదు."

భావ చిత్రణ :

ఆలోచనలలో ఆధునిక శాస్త్రవేత్తలు ఊహ, భావన అని రెండు విభాగాలు చేశారు. స్థూలంగా దీన్ని గురించి చెప్పాలంటే స్పష్ట దర్శనానికి దగ్గరగా ఉండేది భావన. దూరంగా ఉండేది ఊహ. ఊహలో వస్తుసంబంధమైన ఆలోచన మొదటిది. భావనలో కంటే ఊహలో సృజనాత్మకత అధికం. (చూ. కుల శేఖరరావుగారి భాగవతానుశీలనము - పి. హెచ్. డి. సిద్ధాంత గ్రంథం). ఈ రెండూ బుద్ధన్న రచనలో కనిపిస్తాయి.

'సంక్రాంతి' అన్న ఖండికలో సంక్రాంతి సహజ వర్ణన లతో సాగింది.

నీల నిర్మల మేఘమాలా ప్రఘూణాల
　　కుంతలమ్ములకు చిక్కులను తీసి
దూర దిగ్వృక్షపక్ష్మ తోరణమ్ముల లోన
　　మోహనా పాంగకమ్ములను విసరి
రోదోఽంతర స్నిగ్ధ రుక్మ వక్షమ్ము పై
　　కాంతిచ్ఛటా కంచుకమ్ము తొడిగి
ఘన వనాంతర మహీ కటి చక్రకమ్ము పై
　　పూల చీరకు చుంగు ముడి బిగించి

రమ్య రంగవల్లి గృహ ప్రాంగణముల
పాద ముద్రాంకములు బయల్పడగ జేసి
కాల పురుషుని కై దండకై జగాన
అంద మెగబోసె సంక్రాంతి సుందరాంగి.

ఇక్కడ విశ్వమే సంక్రాంతి సుందరాంగిగా భావింప బడింది. ఒక్కొక్క శరీరాంగాన్ని ఒక్కొక్క పాదంలో చక్కగా చిత్రించడం జరిగింది. మొదటి పాదంలో మేఘమాలా కుంతలాలు (కేశాలు) చిక్కులు విడదీసుకున్నట్లు; రెండవ పాదంలో దిక్కులనెడి కనురెప్పల చాటుగా క్రీగంటి చూపుల్ని విసరినట్లు; మూడవ పాదంలో రోదసీ సీమయే బంగారు వక్ష స్థలం - ఆ వక్షం మీద వెలుగుల రవికెను తొడిగినట్లు; నాల్గవ పాదంలో వనభూమి అనే కటివలయం పై పూల చీరకు చుంగు ముడి బిగించినట్లు; తేటగీతి మొదటి, రెండు పాదాలలో ఇంటి ముంగిళ్ళలో పాదాలు (కాలి పాదాలు) రంగవల్లి రూపంలో బయల్పడినట్లు భావించాడు కవి. ఇది చక్కటి భావన. నీల కుంతలాలతో ప్రారంభించి రంగవల్లి పాదాల (పారాణి పూసిన పాదాలు)తో పద్యాన్ని అంతం చేయడం - ఒక క్రమం, ఒక కళ.

గుమ్మడి పూల గాలి పయి కులికి సమస్త గృహాంగణ ప్రదే
శమ్ములలో సరాగ సంభ్రమముల్ కలబోసి, సర్వ వి
శ్వమ్ము లివే, కుతూహల హసంతికలై చెలరేగ, నూత్న భా
వమ్ముల నిండిపోయె వర పర్వము క్రాంతి సమగ్ర సౌమ్యమై.

ఇక్కడ సంక్రాంతి సంభ్రమం సహజ సుందర భావంతో వర్ణించబడింది. ప్రతి ఇంటి ముందర గుమ్మడిపూల గాలి కులికిన దట. సర్వ జగత్తు ఉత్సాహమైన నవ్వులతో నూత్న భావము లతో సంక్రాంతి శోభాయమానమైనదట. "యేటా వచ్చే సంక్రాంతి యేటా యెందుకు కొత్తగా వుంటుంది? శ్రీ బుద్ధన్న వంటి కవుల లేఖినీ రాగకింకిణీ నాదం వల్ల!" అంటారు పూర్వపు ఆస్థానకవి కీ. శే. డా॥ దాశరథిగారు.

'స్మృతి సూక్తము' అన్న ఖండికలో మగవాడు మగువ (స్త్రీ)చేతిలో మోసపోయినట్లు వర్ణింపబడింది. ఈ కాలంలో కట్నం దగ్గర మగవాని చేతిలో మోసపోయే స్త్రీలే ఎక్కువగా ఉండగా- మగవాడే మోసపోయి విరహ వేదనతో బాధ పడ్డట్టుగా అభివర్ణించ డంలో బుద్ధన్న బుద్ధి ఏమిటో మరి! కవి యొక్క మిత్రుడొకడు ఒక మగువను ప్రేమించాడట. తీరా పెళ్ళిదాకా వచ్చి ఆగి పోయింది. దానిక్కారణం ఆ కన్య తల్లిదండ్రులు ఆ అమ్మా యిని ఒక డాక్టరుకో, ఒక ఇంజనీరుకో కట్నమిచ్చి పెళ్ళి చేస్తా మని గట్టిగా చెప్పడమే దానితో ఆ తలిదండ్రులతోపాటు ఆ మగువ కూడా మనసు మార్చుకున్నదట. కట్నం ఏమాత్రమూ తీసుకోకుండా నేను పెళ్ళి చేసుకుంటాను అని ఎంత మొత్తుకున్నా వారు వినిపించుకోలేదు. దానితో ఈ మిత్రుడు విరహవేదనతో పిచ్చివాడై పోయాడు. బహుశా ఇది కవిని కదిలించివేసి ఉంటుం దేమో (ఆ మిత్రుడు కిరోసిన్ పోసుకుని నిప్పు అంటించుకొని చనిపోయాడు కూడా) అదే స్మృతి సూక్తంలో బయల్పడి ఉంటుందని నా భావన.

మగవాని బ్రతుకు చితి అయింది అంటున్నాడు.

మమత లెన్ని యెన్ని మగువ కోసము పొంగి
 క్రుంగిపోని హృదయకోశ మేది!
బాసలెన్ని యెన్ని మోసమై మగవాని
 బ్రతుకు చితియె కాని గతి మరేది!

చపల భావాలు సజావుగా పోషిస్తూ ఆ మగువ— అంటూ ఆమె చేసిన కత్తి గాయము మానిపొయ్యేది కాదు అని చెప్తున్నాడు కవి

చపల భావముల సజావుగా పోషించి
 గుచ్చె నీకు లక్ష్యమేమి

.... .... .... .... ....

కానగాని కత్తిగాయమై మాయక
 చేదు బాధమైన చేష్ట నీది!

'రాగ కింకిణి' అన్న ఖండిక అతి రమణీయంగా ఉన్న దనడానికి కారణం బుద్ధన్న కవి రమణీయంగా వర్ణించడమే.

ప్రతి పుష్పమ్మొక ముగ్ధమోహన వధూ రత్నాకృతిన్ ఈ మృదూ
ర్జిత లావణ్య లతా ప్రతానముల నుస్సేకించి లజ్జా ప్రమో
దిత భాస్వద్దళ దర్పణమ్ముల వనీ సీమంతి నీ చిత్తమున్
ప్రతిబింబించుచు నున్నదంచిత మధు ప్రఖ్యాతతోన్మీలమై.

ప్రతి పుష్పము ఒక ముగ్ధమోహన వధూ రత్నాకృతిని పోలినదట. అందే ప్రతి పుష్పాన్ని కొత్త పెళ్ళికూతురుతో పోల్చాడు. వంపులు తిరిగిన లతా ప్రతానాలలోని పుష్పదళాలు సిగ్గుతో కూడిన చిర్నవ్వులతో ఆ వనంలో అతిశయించి ప్రకా శిస్తున్నాయట. (కొత్త పెళ్ళికూతురు మొహంలో చిరునవ్వులు కనిపిస్తున్నప్పటికీ 'పైమత్తేనియస్'గా సిగ్గుపడటం కూడా సహజమే కదా).

'అనార్కలి' అన్న ఖండికలో కరుణారసం పరిపోషించ బడింది అనార్కలి ప్రేమగాథ సుప్రసిద్ధము. అనార్కలి శ్వాసను ఆపడానికి మట్టిలోని ప్రతి అణువు ఘోష పెట్టినదట. మట్టి రేణువులకు అనార్కలిపై ఎంతో జాలి ఉన్నట్లు కవి ఊహించడమే ఒక మధురమైన భావం.

ప్రణయ బలిని గోడు పాదుషా పాషాణ
 శాసనమ్ము నీదు శ్వాసనాప
మృత్తికా సమస్త రేణువుల్ నీకునై
 కుమిలి కుమిలి శ్వాస ఘోష పెట్టు

భూవలయంలో అనార్కలి ప్రణయగాథ మూల్గుచుండగా గగన మార్గంలో ఉన్న మేఘము ఈ కథకు కరిగి అశ్రువులనే కురిపినదట.

భువన వలయాన నీ గాధ మూల్గుచుండ
 జాలువారని బాష్ప నిర్ఝరము లేదు!
గగన మార్గాన నీ గాథ కదలుచుండ
 కరగి కురియని అశ్రు మేఘమ్ము లేదు!

దాశరథిగారి మాటల్లోనే చెప్తే - "కరుణరసార్ద్ర దేవత ఈ సంపుటిలోని ఇరవై ఆరవ పుటలో వచ్చి వాలిందా అని పించింది. కన్నీట ఈ పుట తడిసిపోయింది.

'ప్రేమ బుక్కులు' ఖండికలో ప్రేయసీ ప్రియుల ప్రేమ పరాకాష్ఠ చేయుకునేటట్లు మరో ప్రేమ జగత్తును సృష్టించాడు కవి. ప్రియుడు ప్రియురాలు తీయని కబుర్లు చెప్పుతుంటూ కాలం గడిపే టప్పుడు కాలం తొందరగా ఖర్చు అయినట్టుగా (తొందరగా గడచినట్టుగా) ఉండడం సహజం. దీన్ని బుద్ధన్న కవి వీరిరువురిని చూసి ఓర్వలేక కాలం అతి శీఘ్రగతిగా కరిగిపోయిందని చక్కగా భావించాడు

జగతిలోన ప్రేమ జగతియే చిత్రమ్ము
 గుండె ఊసు లచట పండిపోవు!

తియ్యనైన మొదల నయ్యాటలను చూచి
కాల మోర్వలేక కరగిపోవు!

రెండు విరుద్ధమైన విషయాలు ఒకదాని వెంట ఒకటి అంటి పెట్టుకొని రావడంలో క్రమానుగతిని చక్కగా అభివర్ణించాడు కవి. మొదట చలువ, తర్వాత మంట ఈ రెండు విరుద్ధ విషయాలు ఒకదాని తర్వాత ఒకటి ఎలా అంటిపెట్టుకొని వస్తాయో ఈ కింద చూద్దాం.

వలపు చలువ వెంట వలవరింతల మంట
మండిపోని ప్రేమ గుండె యేదిః!
ప్రేమ బంధమనగ విధురమ్మునకు సందు
విధుర మనగ ప్రేమ విధి వసందు!

వలపు ఎప్పుడు మొదలవుతుందో అప్పుడు వలవరింతలు మొదలవడం సహజమే కదా మరి. వీటిని క్రమంగా చలువ, మంటగా సరిపోల్చడం చక్కటి భావన. ప్రేమబంధం ఏర్పడితే వెంటనే విరహానికి అవకాశ మేర్పడుతుంది. ఆ విరహంలోనే ఒక విధమైన థ్రిల్ (వసందు) ఉంటుంది. వలపును చలువతో పోల్చాడు. ఇక విరహానికి విరహాగ్ని అని పేరే ప్రసిద్ధం కదా! ఈ విధంగా రెండు విరుద్ధ విషయాలు వెంట వెంటనే వస్తున్నాయి.

'చీకటి' ఖండికలో భావ చిత్రణ పరమాద్భుతంగా ఉంది. ఇక్కడ కవి ప్రతిభ ప్రస్ఫుటంగా కనబడుతుంది. భావించడం సమంజసంగానూ, సహజంగా కూడా ఉంది.

చుక్కలు చంద్రు డున్న జాగ జొచ్చె నభమ్మున ధ్వాంత భీతి కిం
జిక్క, తమాల వృక్షముల స్నేహ మొనర్చుచు కారు మబ్బు ల
ద్దిక్కుల మేరలంగనగ ద్రిమ్మర జొచ్చె, ననంత విశ్వమున్
చిక్కని మత్తులో మునగ జేయుచు నేడు భయంకరంబుగన్.

చీకటి భయానికి చుక్కలు, చంద్రుడు మేఘాల చాటుకు పోయి దాక్కున్నాయి. కారు మబ్బులు చీకటి ప్రామతో స్నేహం చేసి ఆ మబ్బులు నాలుగు దిక్కుల వ్యాపించి విశ్వాన్నంతటిని మత్తులో ముంచి వేసినదట.

తన అంకాన సమస్త జీవులను నిద్రా మూర్ఛలో ముంచి ఘూ
క నినాదమ్ములతోడ జోల లిడు నీ గాఢాంధకారంపు రూ
పమునన్ మిణ్గురు పుర్వులన్ కొఱవి దయ్యంబుల్ శరీరంబులన్
కనులన్ నిప్పుల గ్రక్కుచున్న యవి కష్టల్ నీని కేపాటివో!

ఒక విషయం సాధారణ (మనుషుల) కంటికి కనిపించడం వేరు. కవి కంటికి కనిపించడం వేరు. రాత్రిపూట మిణుగురు పురుగులను, కొఱవి దయ్యాలను అందరూ సాధారణంగా చూస్తూనే ఉంటారు. అవి కవి కంటికి వేరొక రకంగా కనిపిస్తాయి. వెంటనే తన బుద్ధిని కవితా రూపంలో ప్రదర్శించుకుంటాడు.

రాత్రిపూట వినవచ్చే క్రిమి కీటకాదుల శబ్దాలను జోల పాటగా భావించాడు కవి. గాఢాంధకారమైన రూపాన్ని అలాగ దానికి మిణుగురు పురుగులు, కొరవి దయ్యాలు - వాటి కనుల వెంట నిప్పులు గ్రక్కుతున్నాయి. (మిణుగురు పురుగులు రాత్రి పూట చిన్న అగ్గి నిప్పుల రవ్వల వలె మెరుస్తుంటాయి.) వీటికి చీకటిపై ఎంత కక్ష ఉన్నదో అని కవి చమత్కరించాడు.

'ఆత్మోపశమనము' అన్న ఖండిక దుఃఖ సాగరములో మునిగిన మానవు లందరిని ఓదార్చినట్టుగా ఉంది. రాబోవు కాలంలో మంచి కాలము తప్పకుండా రానున్నదని భావి జీవితంపై ఆశతో జీవించుమని ఊరడిస్తున్నాడు కవి.

నిమత్తైశ్వర్య వసంత దర్పిత ప్రజా వృక్షోల్ల సద్వైభవుల్
గని, డెందమ్మున కంది పోకుము వ్యథా కల్లోలితాత్మా! భవ
ద్భవ దారిద్ర్య నిదాఘ శుష్కిత మనః కాంతార మానంద నం
దనమై నిచ్చెడి కాలచక్రహిత విన్యాసంబు నీ కబ్బెడిన్.

ప్రపంచమంతా ఐశ్వర్యంతో కూడి వారి బ్రతుకుల జీవన ప్రమాణాలు మెరుగుగా ఉన్నాయని, నీ బ్రతుకులో మాత్రము దారిద్ర్య మున్నదని మనసులో కందిపోకుము. కాలచక్రములో ఎప్పుడో ఒకప్పుడు ఆనంద నందనం వచ్చే సమయం నీకూ ఉన్నదిలే అని ఊరడింపు.

అవమానాలు, పరాజయాలు, గతశోకావేదనా సంస్మృతుల్
వివిధ క్రూర జనాళి కఠిన విద్వేషోక్తి సంఘాతముల్
భవదాంతర్యము వీడిపోవను విలాపాధిక్యమేలా! హృదిన్
నవసంతోష సముద్ర ముద్రిత పరంధాముండు మేల్కాంచెడిన్.

అవమానాలు, పరాజయాలు, శోకావేదనలు, క్రూరజనులు నీపై చూపు ద్వేషాలు నీ మనస్సు నుండి వదలిపోవని అమిత మైన బాధ యెందుకు! నవ సంతోషము నీకు భావి కాలంలో తప్పకుండా వస్తుందిలే. శోకం చెందవద్దని ఊరడిస్తున్నాడు.

కష్టాలు లేకుంటే సుఖం విలువ తెలియదని, కేవలం సుఖమే ఉన్నా అది సుఖంగా కనిపించదని దృష్టాంతం కూడా

ఈ కింది పద్యంలో చెప్పాడు కవి. రత్నానికి ఒరపిడి లేకుంటే వెలుగొందదు. అంటే సుఖం విలువ అప్పుడు కాని తెలియరాదు. కష్టాలను కూడా ఒరపిడిగా భావించడం ఎంత చక్కటి భావన ఎంతటి ఊరడింపో చెప్పనలవి కాదు. అలా చెప్తూ బాధలు తొలగిపోయి ఆనందం మెరిసిపోయే దినం వస్తుంది, అంతవరకు ఈ బాధలు సహింపుమని ఓదారుస్తున్నాడు. నిన్ను బాధలు పెట్టిన వారు మరల నీ చోటుకే చేరతారని జోస్యం చెప్తున్నాడు.

ఒరపిడి లేని రతన ముజ్జ్వల రూపము నొందనట్టు లీ
ఉరుతర వేదనల్ గలుగకున్న సుఖప్రద నీకు లేదు, నిన్
కరచిన లోకమే మరల గాధ సుహృద్వలయ ప్రపన్నమై
మురియుచు నీ దరిన్ మెరిసిపోవు దినం బయితెంచు పైపుమా.

**అంత్య ప్రాసల బుద్ధి :**

భాషకు ఛందోలయలు, ప్రాసలు సహజమే కాని కృత్రిమం కాదు. ఒక అందమైన భావాన్ని చెప్పడానికి ప్రపంచంలో వ్యవహారంలోనే ఇది కనిపిస్తుంది. ఉదాహరణకు లోకంలో వాడే సామెత లెన్నిటిలోనో ఈ ప్రాసలు (యతులు కూడా) ఉన్నాయి.

విరిగిపోయిన కాలిని కుక్క డింపే ఏమి - నక్క డిందే ఏమి
మెత్తగా వుంటే మోచేత్తో మొత్తుతారు

ఇక జంట పదాలెన్నిటిలోనో ప్రాసలున్నాయి. ఉదా: చక్లి పక్లి, దూరాభారం, హంగు పంగు మొదలైనవి.

ఆధునిక గేయ రచయితలు కొంతమంది (అందరూ కాదు) కవిత్వానికి ఏ ఛందస్సూ, ప్రాసలు అవసరం లేదని గింజుకున్నా అవి లేని కవితలు ఇట్టే చాలా కాలం బతకలేవు సరికదా! మనసులో అవి క్షణకాలం సేపయినా నిలవవు.

ఆధునిక గేయా లెన్నిటిలోనో ఈ ప్రాసలు అనేకచోట్ల వాడబడ్డాయి. (ప్రాసలు, గణాలు, యతులు అన్నీ ఉండి కూడా దానిలో కవిత్వం లేకుంటే అది పది కాలాలపాటు మనజాలదని అందరికీ తెలుసు కదా!)

కుక్క పిల్ల
సబ్బు బిల్ల
అగ్గి పుల్ల - కాదేదీ కవిత కనర్హం.

ప్రస్తుతం బుద్ధన్న కవి తన ఆటవెలది పద్యాలలో చక్కగా అంత్యప్రాసలు సహజ సుందరంగా కుదిర్చాడు. అలా కుదర్చడంలో ఏమాత్రమూ కృత్రిమం లేదని మనకు పద్యాలను చూస్తూనే అర్థమవుతుంది. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

బుద్ధన్న వాడిన అంత్య ప్రాసలను రెండు రకాలుగా చెప్పవచ్చు. మొదటిది - రెండవ పాదానికి, నాలుగవ పాదానికి అంత్య ప్రాసలు కుదర్చడం.

మగువ మనసులోన మమత పెంచినవాని
వదము పదము నిత్య మధుర మురళి
పడతి మనసులోనె పగ పెంచు నవ్వాని
శిథిల జీవితమ్ము విధుర ఖురళి
(ప్రేమ ముక్కలు)

హిమ నదీ నదమ్ము తెగని నీ మనసులో
పగలు రేయి చలువ పందె మాడు
కొసరి కొసరి అమృత కూటమ్ము తెన్నొ
నీ మాటలోన తీపి పాట పాడు (మాన్య స్మృతి)

రెండవది - ఒకటి, రెండు పాదాలకు గాని; మూడు, నాలుగు పాదాలకు గాని అంత్యప్రాసలు కుదుర్చడం.

నిమిష నిమిషమునకు నిట్టూర్పుల కోత
మమత బడిగిపోని మనసు వ్రాత

... .... ... .... .... .... ....

లోకమంత వాద లుప్తాంత రంగమ్ము
స్థూల రూపమొకటె చూడ నోపు
రూప ఫలము విధు వనోవ గూహన కేళి
అంతరంగనయన మంత ధూళి

'రాగ కింకిణి' సంపుటిలోని మొత్తం ఆటవెలదులన్నీ ఈ రకమైన అంత్యప్రాసలతోనే సాగాయి. కవిగారికి ఈ అంత్య ప్రాసలపై విపరీతమైన బుద్ధి ఎందుకో మరి! (ఇవి సహజంగానే ఉన్నాయని ముందుగానే చెప్పాను సుమండీ!)

సంస్కృత సమాసాలు ధారావాహికంగా నడిపించడం :

వ్యవ్తమైనట్టి, సరళమైనట్టి తెలుగు మాటలతోపాటు సంస్కృత సమాసాలను సునాయాసంగా, అనర్గళంగా నడవడం బుద్ధన్నగారి బుద్ధికి (ప్రతిభకు) తార్కాణం. మచ్చుకు కొన్ని:

(అ) విధురాశా గహనాంత రాద్రి కుహరాభీలాంధకారాలు -(ఆత్మోపశమనము)

(ఆ) వ్యవ్న కంకాళ కరాళ నృత్య పరిపుట్టిత వక్త విషాద వేదనా పాలిత రోదసిస్ - (చీకటి)

(ఇ) విమతైశ్వర్య వసంత దర్పిత ప్రజా వృక్షోల్ల సద్వైభవులు - (ఆత్మోపశమనము)

(ఈ) దూరవసీ సమీర కణ తుందిల హైమహరిత్త టంబులు - (ఉదయరాగము)

(ఉ) కాకలీ ప్రణవ రాగాలావనాశా మరుద్వలయ స్పందిత విశ్వభంగిమలు - (ఉదయ రాగము)

(ఊ) దుకూలభూత మందార మనోహర ప్రసవదాతు రజః పరిలిప్త రోదసీ పూరిత దేహాయై - (ప్రభాత కోళ)

ఫారసీ, అరబ్బీ పదాలు :

సందర్భానుగుణంగా ఫారసీ, అరబ్బీ పదాలను బుద్ధన్న కు వద్దన్నా వాదే బుద్ధి ఉందని దాశరథిగారు గుర్తించారు. కొన్ని ఉదాహరణలను ఈ కింద ప్రదర్శిస్తాము.

| అరబ్బీ పదాలు | | ఖండిక పేరు |
|---|---|---|
| గుల్ బహారు | | అక్షర వైజయంతిక |
| (గుల్ = పుష్పం; బహారు = వసంతం) | | |
| రివాజు ( = పద్ధతి) | ... | " |
| పాదుషా (నవాబు) | .... | అనార్కలి |
| పజావు(గా) (చక్కగా) | .... | స్మృతి సూక్తము |
| లత్తుకోరు (రంకుతనం) | .... | స్మృతి సూక్తము |
| గుల్మొహరుపు(పుష్పము పేరు) | .... | " |
| గల్లీలు (వీధులు-సందులు) | .... | " |
| కసాయి | .... | " |
| (కర్కశత్వము, కాఠిన్యము) | | |
| పహరాలు (కావలాలు) | .... | విధురగళము |

మిగిలిన అన్ని ఖండికలలో కంటే అరబ్బీ పదాలు 'స్మృతి సూక్తము'లో ఎక్కువగా కనిపించడానికి కారణం— కవిగారి మనః స్థితికి నేపథ్యంలో ఏదైనా కారణముండే ఉంటుం దని నేననుకుంటున్నాను.

| విచిత్ర పదబంధాలు | | ఖండిక పేరు |
|---|---|---|
| పూల పహరాలు | .... | విధుర గళము |
| వింగిపూల షామియానా | .... | " |
| కుతూహల హసంతికలు | .... | " |
| విరహ సేతువు | .... | " |
| విధుర ఖురళి | .... | ప్రేమ ముక్కలు |
| కత్తి పడుగులు | .... | " |
| విద్యుద్వీణ | .... | అంబేద్కర్ |
| వెతల విప్పులవాన | .... | " |
| వల వికుంఠము | .... | " |
| కాల చక్రహిత విన్యాసము | .... | ఆత్మోపశమనము |
| నవసంతోష సముద్ర ముద్రిత వరంధాముడు | | " |

మొత్తం మీద బుద్ధన్న కవితలు రాగ - లయ బద్ధంగా (ముఖ్యంగా ఆటవెలదులు) మృదు మధురంగా ఉన్నాయి. అతనికి గల భావనా పటిమ చెప్పుకోదగ్గది. డా॥ దాశరథిగారి మాటలలోనే చెప్పాలంటే బుద్ధన్నను - 'బుద్ధిమంతుడు' 'వృద్ధిలోకి రావలసిన వాడు' అని కాదు మనం అనవలసింది - అతడు 'సిద్ధహస్తుడు' అనాలి.

# ఏమి చేతురా! లింగా!....

మహాదేవ శంభో!
మాలింగమూర్తీ!
వెండి బిల్లనైనా కాను
పొక్క బెరడునైనా కాను
వలుగొమ్మల మేకాన్నయినా కాను
తుమ్మకొమ్మల్లోని తేటినైనా కాను
గంగోదకాలలోని చేప కప్పనైనా కాను
అక్షయావుల లేగదూడనయినా కాను
అర్ధం దొడ్డమైన పోగులతోనో
గట్టి గట్టివైన రాళ్ళతోనో
ముళ్ళ కంపలతోనో, తీగలతోనో
ఎంగిలి తేనెలతోనో
నీచు నీళ్ళతోనో
అశుద్ధమైన పాల నురగలతోనో
ఎట్లయినా
నిన్ను మెప్పించటానికి!
నీ జాలి మారగొనటానికి!
నీ శ్రీచరణాల్ని కొలవటానికి!
ఓ పెంట గాడిదను,
పెడతొక్కల గొడ్డును!
చూపు గుడ్డాన్ని,
తొమ్మిది తొర్రల తోలుతిత్తిని,
నడ పీనుగుని,
కానివాణ్ణి
కొరగానివాణ్ణి!
నిష్ప్రయోజకుణ్ణి!
ఏమి చేతురా లింగా! మహానుభావా!

నన్ను
కడుపున బెట్టుకోవకు!
కడుపులో బెట్టుకోను!
అదే నాకు కైలాసం!
'ధనియాల జాతి వాడినని' కటకట బడకు!
నీ గోత్రం వాడినే కదా!
కటాక్షించు!

# అప్రమేయం

మనసు పుట్టించే
మాటలు పాటలు వ్రాసి
మనసు కవిగా, సుకవిగా
బహుజనుల నోళ్ళల్లో నానుతున్నవాడా!
దేవునిలో లీనమైతే
పునర్జన్మ ఉండదు
మనీషిగా కాపాడుకున్నావేమో!
పైగా వాడు మనసు లేనివాడని గ్రహించావేమో!
మనసున్న మనుషుల మనసులలో
కలిసిపోయావు.
ఒకరి కివ్వరాని ఓడిపోని
గాయం కాని మాసిపోని
పగిలిపోని అతుకుపడని
మాయకాని మట్టికాని
గతి తప్పని కీర్తిని మూటగట్టుకొన్నావు
నీకు గిట్టం పెక్కడిది
మన్యుః అప్రమేయవు!

# మరో ప్రపంచపు రాణి

ఎర్రబావుటా నిగనిగల్లాంటి కళ్ళు.
హోమజ్వాలల ధగధగల్లాంటి ఒళ్ళు
శివ సముద్రపు అలల కురులు
బంధూక పుష్పాల్లాంటి బింబాలు!
మేరువు లాంటి చిత్త స్థైర్యం
నయాగరాలా వేగిరపు గమనం!
ఆమె - హసియిస్తే అనురాగపు టంచులు చూస్తాం!
ఆగ్రహిస్తే అధ్వానపు టడవుల్లో పడిపోతాం!

ఆమె
రసరాజ్యడోల
కంకేళికామంజరి
చాంపేయమాలనే కాదు!
ఉష్ణరక్తకాసారం

అగ్నిపరప్పున వికసించిన వజ్రం
ఫిరంగి నాదం!

ఆమె స్వర్గమే కాదు
నరకం,

దుర్గమే కాదు
పద్మవ్యూహం!

ఆమె కేదారగౌళనే కాదు
ఉరి కూడా!

ఆమె (మార్గం) అవర్గళం
అనితర సాధ్యం!

## కాశీ ప్రయాగలుగా మారుద్దాం!

నువ్వు తెలుపని
నేను నలుపని
వర్ణ విభేదాలు జగడాలు
ఎందుకు సోదరా!
రా ముందుకు!

గంగా యమునల్లాగా సంగమించి
ప్రవహిస్తూ
ఎల్లలోకాల్ని
కాశీ ప్రయాగలుగా మారుద్దాం!

## ఈ దేశపు ఎన్నికలలో ...!

ఓటర్లు
పన్నీటి కలశాలు!

పోటీ చేస్తున్న వ్యక్తులు
బూడిద బుస్సన్నలు!

ఇద్దరికీ పొంతం కుదరదు!
ఎప్పటికప్పుడు
ప్రజాస్వామ్యం
వ్యర్థమవుతుంటుంది!

## గంగి గోవు పాలు!

కొంచమయినా చాలు
తోటివాణ్ణి
పరవశింప జేస్తుంటుంది
కవికరం!

## సాహిత్య గ్రంథం!

తెలిసినవారికి
కౌదవు!

తెలియనివానికి
చిట్టా!

వ్రాసినవానికి
కీర్తి పాగా!

కాని....

కడుపు నింపదు!
కాలు నింపదు!

## అగస్త్య భ్రాతను!

కదలేని
ఈ "బాధల సముద్రాల్ని"
భరించలేకపోతున్నది.
అత్యల్పమైన
నా "గుండె పిడికిలి"!
పాలించు ప్రభూ!
నేను అగస్త్యుణ్ణి కాను.
అగస్త్య భ్రాతను!

## అల్పుడైననూ....

సువర్ణయోగం సాధిస్తే....
వివేకుడుగా
విశ్వదాభిరాముడుగా
పేమ మిగులుతుంటాడు.

శ్రీ కె. కిశోరుబాబు; శ్రీ కె. అశోకుబాబు

## శ్రీ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు

# తొలి తెలుగు అధిక్షేప నవల

మన సంఘంలోను, సాహిత్యంలోను గొప్ప చైతన్యం కలిగించిన వైతాళికులు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. సాహిత్యంలో ఆయన 'అనేక' ప్రక్రియలకు ఆద్యులు. తెలుగులో తొలి అధిక్షేప నవల రాసిన గౌరవం కూడా వారిదే. నవలగా పంతులుగారి రాజశేఖర చరిత్ర ప్రాథమ్యం గురించి వివాదం ఉంది గాని అధిక్షేప నవలగా ఆయన సత్యరాజా పూర్వదేశ యాత్రల ప్రాధమ్యం గురించి అభిప్రాయ భేదం ఉండదు. రాజశేఖర చరిత్రలో అక్కడక్కడా తెలుగు జీవితాలలోని మూఢ విశ్వాసాలు, దురాచారాలు, అధిక్షిప్తాలయినా నవలకు అధిక్షేపమే ఆత్మగా రూపొందటం సత్యరాజా పూర్వదేశ యాత్రలతోనే మొదలు.

ఇది పంతులుగారి సంఘ సంస్కరణ కార్యక్రమంలో ఒక భాగంగా పుట్టిన రచన. సంఘ సంస్కరణకు పూనుకున్నాక పంతులుగారు పద్య ప్రక్రియను ఆదరించలేదు. మార్పుకు సాహిత్యం ఒక ప్రభావవంతమైన పనిముట్టని గ్రహించడంతోబాటు సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండి, హృదయానికి హత్తుకుపోయేది వచనమే కాని పద్యం కాదని కూడా తెలుసుకున్నారు. వచనానికి ప్రాచుర్యం కల్పించారు. ఆయన వచన రచనల్లో రెండు శాఖలున్నాయి ఒకటి విజ్ఞాన (ఉపదేశ) ప్రధానం. రెండవది అధిక్షేప ప్రధానం. ఈ సత్యరాజా పూర్వదేశయాత్రలు రెండవ శాఖకు చెందింది.

అధిక్షేపం సమర్థుడయిన, వివేకి అయిన రచయిత చేతిలో గొప్ప ఆయుధంగా రూపు దిద్దుకుంటుంది. ప్రజలలో జాగృతి కలిగిస్తుంది. దోష భూయిష్ఠమైన అధిక్షిప్తంలో పరివర్తన తీసుకు వస్తుంది లేదా భయాన్ని రేకెత్తించి దాన్ని అదుపులో పెడుతుంది. ఇది గమనించి తాను ముఖ్యంగా ఎదుర్కొదలిచిన రెండు విషయాలను ప్రధానంగా చేసి ఈ నవలను రాశారు వీరేశలింగంగారు.

సత్యరాజా పూర్వదేశ యాత్రలలో కథ ఎక్కడా జరగడానికి వీలులేనిది. అసంభవం. దీన్ని ఆంగ్ల సాహిత్యకారులు ఉటోపియా అంటారు. పంతులుగారు ఈ రకమైన రచనకు పూనుకోవడానికి ఆంగ్ల రచయిత జొనాథన్ స్విఫ్టు రాసిన 'గలివర్స్ ట్రావెల్స్' మూలం. ఆ విషయం పంతులుగారే చెప్పుకున్నారు. గలివర్స్ ట్రావెల్స్ లాగా నాలుగు భాగాలుగా వెలువరించాలని ఆయన సంకల్పం. ఏ కారణం వల్లో ఆడు మళయాళం, లంకా ద్వీపం అనే రెండు భాగాలతో ఈ నవల ఆగిపోయింది.

నవలలో సత్యరాజాచార్యుల వారు మొదట సందర్శించినది రంధి దేశం. దీన్ని 'ఆడు మళయాళం' అన్నారు ఆయన. రంధి దేశంలో స్త్రీ పురుషుల పరిస్థితులకీ, జీవన విధానాలకీ మన దేశంలో స్త్రీ పురుషుల పరిస్థితులకీ జీవన విధానాలకీ గొప్ప భేదం ఉంది. అవి పరస్పర వ్యతిరేకాలు. అక్కడ స్త్రీలదే ఆధిపత్యం. రాజ్య పాలనాదికాలు వాళ్లే నిర్వహిస్తారు. పురుషులు గృహకార్యాలు నిర్వర్తిస్తారు. అక్కడ లజ్జ పురుషాభరణం. భార్యే భర్తకు ప్రత్యక్ష దైవం. స్త్రీలు మగవాళ్ళని కొట్టడం మామూలు విషయం. పురుష విద్య నిషేధం. పత్నీ వ్రతం విహితం.

మన దేశంలో ఉన్న పురుషాధిపత్యాన్ని ఎద్దేవా చెయ్యటానికి, తుత్తునియలుగా ఖండించడానికి ఈ దేశాన్ని కల్పించారు కందుకూరి. తలక్రిందులు కథను కల్పించటం పంతులుగారి సృజనాత్మక ప్రతిభకు మంచి తార్కాణం. మగవాళ్ళు స్త్రీలపై సాగిస్తున్న దౌర్జన్యాన్ని మరో రకం కథలో ఇంత తీవ్రంగా ఖండించటం కుదరదు అలాంటి కథ ఇంత చక్కగా చదివించనూ లేదు

ఇది 'ఉటోపియా' చేయటం, కథ తలక్రిందులు చేయటంతో బాటు మరొక విశేషాన్ని కూర్చారీ రచనకు పంతులుగారు. కథంతా విప్రతీకాత్మకంగా నడుస్తుంది. ప్రధాన పాత్ర సత్యరాజాచార్యులు కందుకూరివారి ప్రతినిధి కాదు. ఆయన ప్రతిపక్షుల ప్రతినిధి. తాను దేన్ని ఖండించడానికి పూనుకున్నారో దాన్నే సమర్థించే వ్యక్తిని రచనకు ప్రధానం చేయటం, పైగా కథనంతా అతని

నోటనే చెప్పించటం అద్భుతమైన మేధా విన్యాసం. ప్రధాన పాత్ర కార్యకలాపాలన్నీ (అతనే కథకు వక్త అయినపుడు) రచయిత అభిప్రాయాలకు పూర్తి విరుద్ధాలని స్ఫురింపచేయటం సున్నితమైన సమస్య. రచనలో ఆద్యంతం విప్రతీపాన్ని వాడుకో గల సత్తా ఉన్న రచయితలు అరుదుగా ఉంటారు. తెలుగులో తొలి అధిక్షేప నవల విప్రతీపాత్మకం కావటం నిజంగా విశేషమే. తలక్రిందులు కథ ఆడు మళయాళంతో ఆగిపోయినా విప్రతీపం లంకా ద్వీపంలో కూడా ఉంటుంది.

ఈ నవలలో అధిక్షేపానికి పై విశేషాలు ఎలా పదును పెట్టాయో గమనిస్తే పంతులుగారి ప్రతిభ వెల్లడౌతుంది.

సతీ సహగమనానికి ప్రతిగా పతీ సహగమనాన్ని చిత్రించారు ఈ కథలో. సత్యరాజు ఆ దేశస్థులకు మన సతీ సహగమనం గురించి చెబుతూ - 1804వ సంవత్సరం మొదలుగా గల 25 సం॥రాలలో 70,000 మంది విధవలు భర్తృ సహగమనం చేసి 'పుణ్య లోకాల'కు పోయినట్టు దొరతనం వారి లెక్కలే ఉన్నాయి అంటాడు. "దీనివలన మా దేశము దేశములలో నెల్ల పవిత్రమైనదనియు, పతివ్రతామయమైనదనియు పుణ్య సతీ భరితమయినదనియు మీకు బోధపడి ఉండవచ్చును" (పుట 55)* అని చెబుతాడు.

సత్యరాజు సగర్వంగా చెప్పుకున్నా పంతులుగారు ఈ మాటల్లో గుప్పించిన 'పుల్ల విరుపుతనం' దాచరానిది.

మన దేశంలో వితంతువులకు కేశఖండనం చేయించినట్టు స్త్రీ దేశంలో పత్నీ వియోగం వచ్చిన పురుషులకు ముక్కు ముందరి భాగం కత్తిరిస్తారనీ అందువల్ల వారు కురూపులౌ, అక్కడ వ్యభిచారం నశించిపోయిందనీ చెబుతూ సత్యరాజు ఇలా అంటాడు. "పురుషులకు చేయుట చేత నిది దురాచారమయినను స్త్రీల విషయమున జరిగించిన పక్షమున తప్పక సదాచారమే యగును".... నేను ధర్మశాస్త్రములను వెదకి దీని కాధారముగా కారిక నొందయినను 'కని పెట్టెదను'" (పుట-43)

పంతులుగారి అధిక్షేపం మహా వాడి. కారిక కనిపెట్టెద ననటంలో ఆధిపత్యం నిలుపుకోవడానికి పురుషులు ఎంత దౌర్జన్యానికి అయినా వెనుదీయరని 'రోత' నిక్షిప్తం చేశారు.

ఆడు మళయాళంలో స్త్రీలు పురుష శీలరక్షణకు పెద్ద పెద్ద పెట్టెలు చేయిస్తారు. పురుషుల్ని పగలంతా అందులో బంధించి ఉంచుతారు. మనమూ స్త్రీల కోసం ఇలాంటివి చేయిస్తే బాగుంటుం

---

* ఈ వ్యాసంలో ఇచ్చిన పుట సంఖ్యలు ఎమెస్కో ముద్రణలోవి.

దంటాడు సత్యరాజాచార్యులు. అప్పటికి గాని పురుషజాతి స్త్రీలకు చేసిన అన్యాయం వరాళ్ళకు చేరదని క్రోధసహ్యాలతో పంతులు గారు చేస్తున్న నింద యిది.

స్త్రీలకు పతివ్రతా ధర్మాలు చెప్పి మగవాళ్ళకు బానిసలు చేస్తున్న మన పురాణ ధర్మశాస్త్రాలలోని పద్యాలను ఎగతాళి చేస్తూ కొన్ని పేరడీ పద్యాలు రాశారు ఈ నవలలో. స్త్రీదేశపు పత్నీవ్రత ధర్మాలు అనువదించి వినిపిస్తాడు మన బందిం చాడు సత్యరాజు.

'కుష్ఠరోగిణి యైనను గ్రుడ్డిదైన
భూరి వికలాంగి యైనను ముసలిదైన
బత్ని యెంగిలి భుజియింప వలయు సతము
పుణ్యలోకంబు వాంఛించు పురుష వరుడు'

పురుషుండును గార్దభమున్
స్థిరముగ దండనము లేక చెడిపోదురిలన్ (పుట-34)

ఇవి మచ్చు రత్నాలు.

ఇవి మనకు హాస్యాస్పదంగా తోస్తాయి. తోచాలనే పంతులుగారి ప్రయత్నం. పత్నీవ్రత ధర్మాలు హాస్యాస్పదాలయితే పతివ్రతా ధర్మాలు ఎందుకు కావు? స్త్రీ పురుషులు సృష్టి బండికి రెండు చక్రాలు కదా! వాళ్ళలో అసమానత ఎవరి కుతంత్రం?

స్త్రీ సముద్ధరణ ప్రయత్నానికి జగద్గురువులు పీఠాధిపతులు అడ్డుపడి సుత దురహంకారాన్ని వెల్లడించటం సహించలేక పోయిన పంతులుగారు స్త్రీ దేశంలో పురుష విద్యకు వ్యతిరేకులయి జగద్గురువులు వచ్చినట్టు వర్ణించి అపహాస్యంపాలు చేసి విడిచారు. అధిక్షేప రచనకు కావలసిన సదసద్వివేకం, నిర్భీకతా పంతులుగారిలో పుష్కలంగా ఉన్నాయి

సత్యరాజు సందర్శించిన రెండవ దేశం లంకాద్వీపం. దీన్ని జ్యోతిశ్శాస్త్రం మీద దాడికి కేటాయించారు కందుకూరి.

లంకాద్వీపం రాక్షస రాజ్యం. రాక్షసులు శరీర ప్రమాణంలో మనకంటె అనేక రెట్లు పెద్దవాళ్ళు. కామరూపులు. జ్యోతిశ్శాస్త్రం వాళ్ళ జీవితంలో ప్రముఖ పాత్ర వహిస్తోంది. న్యాయ స్థానాలలో ధర్మనిర్ణయ సమస్యల్లో కూడా ఆ శాస్త్రం ఆధారం గానే పరిష్కరించుకుంటారు వాళ్ళు. అధిక్షేప ప్రయోగంతోపాటు, తర్కబద్ధమైన జ్యోతిశ్శాస్త్ర ఖండన కోసం 'లంకాద్వీపం'లో జ్యోతిశ్శాస్త్ర వ్యతిరేకుల్ని కూడా ప్రవేశపెట్టారు పంతులుగారు.

# కవీ రైతూ దేశానికి రెండు కళ్ళు

## శ్రీ రావి రంగారావు

నాకూ మా నాన్నకూ
తేడా లేదు
మా నాన్న
హలం పొలం మీద పెట్టి
అక్షరాలు రాస్తున్నారు
నేను
కలం కాగితం మీదుంచి
ధాన్యం పండిస్తున్నాను.

మా నాన్న
నేల గుండెను చీలుస్తున్నాడని
నేను
కాగితం శీలాన్ని చెరుస్తున్నానని
ఆయుధాలతో మే మిద్దరం
హింసను ప్రేరేపిస్తున్నామని
గిట్టని వాళ్ళు పొగబెడుతున్నారు
జాతి ప్రాణాలపై పగబడుతున్నారు.

నా కలంలో నుండి అక్షరాలు
ముందుకు దూసుకు వస్తున్న
సుశిక్షితులైన సైనికులు,
హడలెత్తిపోతున్నారు
నా జాతిని పీడించే
నల్లగుండెల వాళ్ళు.

నా కలంలో నుండి అక్షరాలు
ఆకలి చీకట్లను తొలగించే
వెలుతురు ధాన్యపు గింజలు,
చేతులెత్తి పిలుస్తున్నాయి
వి త్తులకు విశ్వరూప శక్తి కలిగిస్తామని
ప్రజా హృదయక్షేత్రాలు

కష్టమంతా పచ్చని అమృతంగా మార్చి
పొలాల నిండు కుండల్లో భద్రంగా ఉంచి
విషంబొట్టు దొంగలు రాకుండా చూసే
కావలాదారుడి చేతికర్ర - నా కలం.

పంటలు పండించలేని సోమరిపోతులు
నా చేలు తొక్కాలనుకుంటున్న ఆంబోతులు
నా బంగరు పంటల బండామీద బురద జల్లుతున్నా
వడిసెలతో మంచె మీద కూర్చొని
ఓట్ల రాళ్ళతో గురిపెట్టి దీక్షగా
మిడతల దండును చెండాడుతున్న
వల్లెపడుచుల నుదుటి కుంకుమతో
నా కలానికి బంధుత్వం.

ఎన్ని శిశిరాలు వెన్నుపోటు పొడిచినా
ఎన్ని వండుటాకులు వదిలేసిపోయినా
ఎన్ని గొడ్డళ్ళ గూండాలు గాయపరిచినా
ఆత్మ విశ్వాసంతో నూతనోత్సాహంతో
మళ్ళీ కొత్త చిగురులు తొడిగే చెట్టుతో.
నా కలానికి మిత్రత్వం.

నిద్రపోతున్న మొద్దుల్లాంటి
ఎద్దుల్ని మేలుకొలిపే
చెర్నకోల నినాదాలతో
నా కలానికి శిష్యరికం.

నా కలం
గోమాతగా సాగిపోవాలనుకుంటే
మీకు అలుసుగా వుంది
మీ రెపుడు పాములుగా మారి
నా దారి కడ్డు వస్తున్నారో
ఆ క్షణం నుంచే నా కలం
గరుత్మంతుడై పరికిస్తోంది.

ఎండిపోయిన మొక్కల ముఖాలు చూచి
జాలితో హడావిడిగా వరుగెత్తుకొచ్చే
గలగలా మాట్లాడుతున్న పరోపకారులు
పంట కాల్వలు నా ఆలోచనలు.

చిక్కిపోయిన పదిపదాలకు
విందుగా కొత్త రక్తాన్ని ఎక్కించి

మాతనో త్తేజాన్ని దివి నుండి భువికి దించే
వర్షపు జల్లులు నా ఆశయాలు.

చిరునవ్వుల పువ్వులతో
అమాయకంగా చూసే పత్తిచేను మీద పడి
రక్తాన్ని పీల్చేస్తున్న దోమల గుంపుమీద
క్రిమి సంహారక మందులు చల్లటం నా ఆచరణ.

నా కలం
పీడితుడికి చిహ్నం
శ్రమ జీవనానికి సంకేతం
సామాన్యుడికి ప్రతీక
ధర్మానికి పతాక.

పంట మొక్కల చుట్టూ
అల్లుకున్న స్వార్థాన్ని చూసి
కలుపు మొక్కలు పీకే
మానవతామూర్తుల్ని అడిగి
ఓ రంగు సిరా తెచ్చుకొంది నా కలం.

తడిసిన పేద తట్టల్లాంటి సమస్యలు నెత్తిమీదున్నా
సేవా భావాలన్నీ గట్టిగా మూటగట్టి
బస్తాలు మోసే వాళ్ళనడిగి
ఓ రంగు సిరా తెచ్చుకొంది నా కలం.

పాలిస్తున్న ఆవుల్నడిగి
దున్ని పెడుతున్న ఎద్దుల్నడిగి
పంటను మోసే బండిని అడిగి
బండిని నడిపే చక్రాల్నడిగి
కన్నతల్లి నేలను అడిగి....
ఇన్ని రంగుల సిరా తెచ్చుకొంది నా కలం
విలాసాల వినోదాల కోసం కాదు,
ఓ తెల్లని కిరణాన్ని సృష్టించి
పదునైన బాణంగా మార్చేటందుకు,
చీకటి గుండెకేసి గురిపెట్టేటందుకు.

అప్పుడే మొలిచిన గింజల
లేత గొంతుల్ని తొక్కుతూ
ఉక్కు పాదాలతో నడిచి వెళ్ళేది
చీకటి.

ఎండిన డొక్కల చెంతకు నడిచి చేరుకుందామని
బయలుదేరబోతున్న పంటల్ని
ఎర్ర కళ్ళతో భయపెట్టి దోచుకొనేది
చీకటి.

ఈ చీకటిని తొలగించటమే
నాకూ మా నాన్నకూ ఆరాటం
తర తరాలుగా మేం చేస్తున్నాం
ఈ చీకటితో పోరాటం.

నాకూ మా నాన్నకూ
తేడా లేదు
మా నాన్న
హలం పొలం మీద పెట్టి
అక్షరాలు రాస్తున్నారు
నేను
కలం కాగితం మీదుంచి
ధాన్యం పండిస్తున్నాను.

మా నాన్న హలంతో
నేను కలంతో
తూర్పునుండి బయలుదేరాము
మార్పు కోసం కలిసి సాగాము,
మా మధ్య నడిచి వస్తున్నాడు
మా చిటికెన వ్రేళ్ళు పట్టుకొని
దిక్కుల్ని పలకరిస్తూ
చిరునవ్వులతో సూర్యబాలుడు
ప్రపంచాన్ని పాలించే
రేపటి మా వారసుడు.

దేవాసుర సంబంధ ఇతివృత్త స్వీకరణ ప్రతీకాత్మకమై, యుద్ధ వర్ణనలు ధర్మ రక్షణ, అధర్మ శిక్షణకు దారితీస్తూ ఇతిహాస నాయకుడు దివ్యత్వ సీమలను స్పృశిస్తూ ఉండే భారతీయ ఇతిహాసం చతుర్విధ పురుషార్థ ప్రబోధంతో ఇహపర సమన్వయ దృష్టి కలిగి ఉంటుంది. విశ్వజనీనమై ఉంటుంది. ఇట్టి విశిష్ట లక్షణాలలో ఇతిహాసం ఎపిక్‌తో విభేదిస్తుంది.

"భారతీయేతిహాసములు ఎపిక్ పోయెమ్స్ కంటె ఉత్తమములైనవి. వీనియందు గానబడు శాస్త్రీకౌన్నత్యము సార్వకాలిక విజ్ఞాన విధిత్వము వంటివి వేద మనబడు ప్రామాణికత్వము వానియందు దత్సాహిత్య రంగమున గానరావు. పాశ్చాత్యుల ఎపిక్ లక్షణములు భారతీయుల మహాకావ్య లక్షణముల కత్యంత సన్నిహితమై యున్నవి. కాని, ఇతిహాస సమగ్ర స్వరూప లక్షణముల నవి ప్రతిబింబించు కొనలేదు."[4]

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు ఆధునిక మహాకావ్య లక్షణాలను పది సూత్రాలలో నిర్దేశించారు.[5] వాటిని వస్తువు ప్రక్రియ కవితా శిల్పాల పరంగా అన్వయించుకుంటే ఈ క్రింది విధంగా క్లుప్తీకరించవచ్చు. వస్తువు - మానవ ప్రగతిని గాని, ప్రస్థానాన్ని గాని సాధ్యమైనంత వరకు ఒక సమన్వయంతో ఒక సమగ్రతతో సమీక్షించేదై ఉండాలి. ఆధునిక జీవితానికి ఒక అర్థాన్ని ఒక సందేశాన్ని గాని అందించాలి. ప్రక్రియ-ఐతిహాసిక పురాణ పద్ధతుల నాశ్రయించి సామాజికులలో ఒక ఆలోచన రేకెత్తింపజేయాలి. ఆకృతిలో విస్తృతి కంటె సారవంతమైన కళాత్మక వ్యక్తిత్వంతో కూడుకున్న సంగ్రహత్వం గోచరించాలి. కవితా శిల్పం - అభివ్యక్తి ఆత్మాశ్రయ రీతిలో గాని పరాశ్రయరీతిలో గాని సాగవచ్చు. అయినా ఎన్నుకొన్న పాత్రలు వ్యక్తులుగా కాకుండా ప్రవృత్తులకు ఉద్యమాలకు, అవస్థలకు, సిద్ధాంతాలకు ప్రతీకలుగా ఉండి విశ్వజనీనతను ప్రకటించాలి. కవితాభివ్యక్తి అనుభూతి నందిస్తూ ఆలోచన రేకెత్తింపచేయాలి.

ప్రాచీన కాలంలో వెలిసిన ఇతిహాసాలు ఆనాటి మతనైతిక సాంఘిక సాహిత్యోద్దేశాలను ప్రయోజనాలను నెరవేర్చడానికి ఆనాటి ప్రజల ఆదర్శాలను ధర్మాలను గానం చేశాయి.

ఆధునిక యుగ చైతన్యం అంతస్సూత్రంగా ఆధునిక సాహిత్య స్వరూప స్వభావ అవగాహనతో ప్రక్రియలో ప్రవృత్తిలో ఆధునికతను ప్రోది చేసుకొని ఈనాటి ప్రజల బాధలను గాథలను గానం చెయ్యడం ఆధునిక ఇతిహాస స్వభావం.

ఫ్యూడల్ వ్యవస్థ పతనమయి ధనస్వామ్య వ్యవస్థ అవతరించడంతో యాంత్రిక నాగరకత మధ్యతరగతి జీవితాన్ని దుర్భరం చేసింది. కార్మికుడు ధనస్వామి చేతిలో పనిముట్టుగా మారిపోయాడు. కర్షకుడు పాలకుల కుతంత్రాలలో చిక్కుకొని వ్యాపార సంస్కృతితో పోటీపడలేక అధోగతిలో ఉన్నాడు. ఆధునిక జీవన వ్యవస్థ సంక్లిష్టంగా తయారైంది. ఇది ఈ దేశంలోని ఈనాటి జీవన వ్యవస్థకు స్థూల చిత్రం.

ఈనాటి జీవన వ్యవస్థను నేపథ్యంగా తీసుకొని సమస్త మానవజాతి యుగయుగాల గాథలు తీర్చిదిద్దబడిన భావచిత్ర గీతిక నా దేశం, నా ప్రజలు - ఆధునిక ఇతిహాసం.

"నేనెప్పుడు గొంతెత్తినా నాకోసం గాదు. ఐదు కోట్లమంది కోసమూ కాదు. యాభై కోట్ల మంది కోసం గొంతెత్తాను. నేను పడుతున్న బాధలే నా దేశమంతా పడుతోంది, నా మానవజాతి అంతా పడుతోంది. కనుకనే నా గ్వాలిక నా దేశపు నాలిక. ఇదే నా దేశం నా ప్రజలు" అన్నాడు శేషేంద్ర.[6]

"అష్టా సర్గాన్నతు న్యూనం త్రింశత్ సర్గాచ్చనాధికం
నాత్యంత విస్తరః సర్గః త్రింశతోనాధికో నతా...."[7]

"సర్గ బంధో మహాకావ్యం ఉచ్యతే తస్య లక్షణం ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖం ఇతిహ ఇతిహాసకథోద్భూతం ఇతర ద్వాసదాశ్రయః చతుర్వర్గ ఫలోపేతం చతురోదాత్త, నాయకం నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనం...."[8]

అలంకారికులు నిర్దేశించిన ఇతిహాస లక్షణాలను ఆధునిక యుగచైతన్యాని కనుగుణంగా సమన్వయ ధోరణిలో సాగింది ఇతిహాసం. ఎనిమిది సర్గలుగా విభజింపబడిన ఈ ఇతిహాసం వస్తు నిర్దేశంతో ప్రారంభమైంది. "లేస్తోంది ఉషః కాంతుల్లోంచి ఒక హస్తం. ఆ హస్తం కాలమనే నిరంతర శ్రామికుడి సమస్తం" - శ్రమశక్తి ఎప్పుడు కార్యోన్ముఖమైందో అప్పుడే ఆదిమ మానవుని జీవితంలో ఉషఃకాంతులు ప్రసరించాయి. పై వాక్యంలో కాలం శ్రామికుడుగా సూర్యుడు ఆ శ్రామికుని హస్తంగా భావించబడింది.

కాలం ప్రవాహశీలమైంది, అనంతం. సూర్యుడు లోక బాంధవుడు. కాలగమనం స్తంభించేవరకు సూర్యునిలాంటి శ్రమశక్తి సిందూర కాంతులు చిందుతూనే ఉంటుంది. శ్రమశక్తి

యొక్క ఔన్నత్యాన్ని నైరంతర్యాన్ని చాటుతూ వస్తునిర్దేశం చేయబడింది. ప్రేమ మనిషిలో మానవత్వానికి మనుగడ నిస్తుంది. ప్రేమ మనిషి సంస్కారాన్ని పెంచి ఉన్నతుణ్ణిగా తీర్చిదిద్దుతుంది. అధర్మం మీద ఎత్తే ధ్వజానికి మూలస్థానం మానవ ప్రేమ అని సూచిస్తూ ప్రేమ అగాధ లోతుల్లో మానవ పదవీ గౌరవాన్ని పొందాను అనే భరత వాక్యంతో ముగుస్తుంది కావ్యం.

ఏ కాలంలోనైనా ఏ దేశంలోనైనా ఆయా కాలాలలో వెలసిన ఇతిహాసాలు ఆయా సాంఘిక వ్యవస్థల ఆదర్శాలను, ఆశయాలను ప్రతిబింబించాయి, ధర్మ స్వరూపాన్ని ఆవిష్కరించాయి. భరత ఖండంలో వెలసిన మహేతిహాసాలు భారత రామాయణాలు. ప్రాచీనేతిహాసాలు ఆయా యుగధర్మ ప్రవర్తకాలు అవుతూనే సార్వకాలికమైన సార్వజనీనమైన సందేశాన్నిస్తుండగా ఆధునిక ఇతిహాసం ఆధునికయుగ చైతన్యానికి అద్దం పడుతుంది.

ఆధునిక చైతన్యానికి స్వర్గ ద్వారాలు తెరచిన సామ్యవాద సిద్ధాంతపు వెలుగులో అతీత వర్తమానాలను అనుశీలించి విశ్వాభ్యుదయానికి కారకులైన అధో జగత్సహోదరుల కష్ట విస్ఫురాలను పరిపూర్ణ సరత్వానికి, సమ సమాజ నిర్మాణం కోసం చేస్తున్న చెయ్యవలసిన ప్రస్థానాన్ని ప్రపంచిస్తున్నది నా దేశం నా ప్రజలు.

ఉత్పత్తి సాధనాలలో వచ్చిన మార్పుల వలన ఉత్పాదక శక్తి పెరిగడం వలన కుటుంబ వ్యవస్థ, వ్యక్తిగతమైన ఆస్తి ఏర్పడడంతో సాముదాయిక భూములను సమిష్టి పరికరాలతో కలిపి సాగుచేసే ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ నుంచి బానిస—బానిస యజమానులనే వర్గాలు ఉద్భవించాయి. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి వేగవంతం కావడం వలన భూస్వామ్య వ్యవస్థ అవతరించింది. కాలం గడచిన కొద్దీ ఉత్పత్తి శక్తులు అభివృద్ధి కావడం, యాంత్రికమైన ఉత్పత్తి జరగడం కారణాలుగా పెట్టుబడిదారీ వ్యవస్థ ఉద్భవించింది.

ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి విధానాలు, ఉత్పత్తి సంబంధాల్లో వచ్చిన మార్పుల వలన గణ సమాజంలోని వ్యక్తి బానిసగా, కర్షకుడుగా, కార్మికుడుగా పరిణామం చెందాడు.

"అనుభవతిహి మూర్ధ్నా పాదపస్తీవ్ర ముష్ణం
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానాం"[9]

వివిధ కాలాలలో తాను ఎంత శీత తాపాలకు గురైనా వృక్షం ఆశ్రితులకు తన స్వచ్ఛ ఛాయతో వేడ తీర్చినట్లు తాను ఎన్ని పరిణామాలకు లోనైనా యుగ యుగాలుగా మానవకోటికి శ్రమను ధారపోస్తున్నాడు శ్రామికుడు. అట్టి శ్రామికుని జీవన పోరాట భావ రూపంగా వరదుకున్నదీ ఇతిహాసంలో. ఆదిమ దశ నుంచి సృజనాత్మకతకు ప్రతీకగా నిలిచిన శ్రామిక జీవిత సంఘర్షణ అనే ఇతివృత్తం ఎంత ప్రాచీనమో అంత ఆధునికం.

జాతులను నాగరకతలను బట్టి ప్రపంచ జాతులలో నాగరకతలలో ఎన్ని భేదాలున్నప్పటికి బౌద్ధిక శారీరక శ్రమలు దోపిడీకి గురి అవుతూ ఉండడం దేశ కాలాతీత సత్యం. అప్రధానంగానైనా దేశ కాల పరిధులకు పరిమితమయ్యే పాత్ర చిత్రణలతో నిండి ఉండే కథారూప ఇతివృత్తం గ్రహించకుండా కథా రహితంగా, వివిధ వ్యవస్థల కోరలలో చిక్కుకొన్న శ్రామికుని ఆత్మవేదనను వర్ణించే ఈ ఇతిహాసానికి విశ్వజనీనత సిద్ధించింది.

"ఒక పృథుల కళేబరం కలిగిన ఇతిహాసం చదివి అందులో నిమగ్నమయ్యేంత వ్యవధి ఎవరికీ ఈ రోజుల్లో లేదు. ఆ కారణం చేత ఈ కాలంలో ఇతిహాసం తన పరిమాణంలో విస్తార ఆకారాన్ని పరిత్యజించి హృదయంలో మాత్రం ఒక విశ్వ వైశాల్యాన్నీ, మహత్వాన్నీ సంతృప్తం చేసుకుంటుంది. అందుచేతనే అది అతి సంశ్లిష్టమై, జటిలమై, అమూర్తమై తన లఘు కళేబరం లోనే అంటే తన సూక్ష్మ శరీరంలోనే ఒక ఇతిహాసపు వైశాల్యాన్ని అభివ్యక్తం చేస్తుంది."[10]

కథారూప ఇతివృత్త రహితంగా నిర్వహింప బడినప్పటికి ఈ ఇతిహాసంలో ప్రకృష్టమైన నిర్మాణ బంధం ప్రస్ఫుటమవుతుంది. ఈ ఇతిహాస సౌధ నిర్మాణానికి ఒకటో సర్గ పునాది లాంటిది. ఒకటో సర్గ ఈ ఇతిహాస స్వరూప స్వభావ ప్రయోజనాలకు ప్రాతిపదిక. ధాన్యం కోసం పుట్టి, ధాన్యం కోసం బ్రతికి, మరణించి ధాన్యంలోకే వెళ్ళిపోయే కర్షకునిగా, ఈ దేశపు స్త్రీలకు రంగు రంగుల కలలు కనే నూలుతో కోకలల్లి సీతాకోక చిలుకల్ని చేసే వస్త్రదాతగా, తన ప్రాణాలనే దేశపు సరిహద్దు కుడ్యాలుగా నిలిపే సైనికుడుగా, దూర దూర దేశాలలో తన దేశపు కీర్తి పతాకాలను ఎగురవేసే నావికుడుగా, రూపాలిచ్చి గొంతులిచ్చి శిలల్ని నిశ్శబ్దాల్లోంచి విడుదల చేసే శిల్పిగా శబ్దాల అణువులతో పద్యాలు చేసే కవిగా, స్వేద తరంగిణి ఎన్నో పాయలుగా ప్రసహించి సర్వమానవ జీవిత పొలాలను సస్యశ్యామలం చేస్తున్నది. వ్యవస్థలో వచ్చిన మార్పుల వలన శాస్త్ర సాంకేతిక రంగాలలో వచ్చిన నూతన పరిణామాల వలన శ్రామికుడు వివిధ రూపాలు

# చర్మవ్యాధులకు




# అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెం

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ అయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ అయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు అదర్శమైన నివారిణి. నేడే కొనండి!

**అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004**

**Amrutanjan Limited**

757-TG

చాలుస్తాడు. ఆదిమ యుగంలో జాంతవ స్థితిలో ఉన్న మానవ జీవన వికాసానికి నాంది వ్యవసాయం.

"ఎవరు దేశమంతా దున్ని తమ దేహపు కండలు మట్టికిచ్చారో ఎవరు నేల గొంతు ఆలించి దాన్ని లాలించి తన చెమటతో రక్తంతో వెన్నలా జున్నులా మృదువు చేశారో పెరిగే పైర్ల వంపూ సొంపూ అందమూ గంధమూ లాలసతో చూస్తూ చూస్తూ ఉదయించబోయే ధాన్యం కోసం కలలు కన్నారో, కానీ అంతిమ సమయంలో ఒక గింజ కూడా దక్కకుండా అంతా విడిచి విష్క్రమించారో అమృత వీరులు మానవ ఇతిహాసంలో అమృత వీరులు."

అని చెప్పిన శేషేంద్ర సర్వ విధాల శ్రమ జీవులకు కర్షకుని ప్రతీకగా గ్రహించాడు. శ్రమ వైవిధ్యాన్ని కవితాత్మకంగా వ్యక్తీకరించాడు. ఆ శ్రమకు ప్రతిరూపం, భూత భవిష్యద్వర్తమానాలలో తిరుగులేని ప్రతీక అయిన కర్షకుని నాయకునిగా చేసి విస్తృత శ్రమ జీవనాన్ని చిత్రించాడు.

"ఇందులో నాయకుడు భారత రామాయణాల నాయకుల మాదిరి ధీరోదాత్తుడు, ధీరశాంతుడు ఇత్యాది లక్షణాలన్నీ పుణికిపుచ్చుకున్నవాడు కాదు. వాళ్ళు ఒక్క యుగపు బాధలే అయితే ఇతడు యుగ యుగాల బాధలు అనుభవిస్తూ ధీరత్వం విడవాడకుండా లోకాన్ని రక్షించే కృషి చేస్తూనే ఉన్నాడు."[11]

సూర్యుడు కాలమనే శ్రామికుని హస్తంతో పోల్చబడుతూ ప్రారంభమైన ఒకటో సర్గ సూర్యుడు కిరణాల బండ్లు తోలుకుని వస్తున్నాడు. అని సూర్యుడు యుద్ధ సన్నద్ధుడైన కర్షకునిగా వర్ణించడంతో ముగిసింది. ఇది వసంత్సరం తిన్న మొదటి కల. ఈ కలలో నేను నా దేశపు శరీరం మీద నడుస్తున్నా. ప్రభాత పూర్వ స్వప్నంలా - వేకువ జామున కలిగిన స్వప్నం నిజమవుతుందన్న విశ్వాసం స్ఫురింపజేశాడు.

రెండో సర్గలో గత చరిత్ర సంస్కృతులను స్పృశిస్తూ ఎక్కడ గ్రామాలు రంగుల కలలలో పరస్పరం మాట్లాడుకుంటాయో ఆ మరో ప్రపంచాన్ని గూర్చిన వర్ణన చేయబడింది.

మూడో సర్గలో విష పాత్రిక లాంటి నగర జీవనం నుంచి బయట పడాలన్న కాంక్ష, తాత్త్విక జిజ్ఞాస, చరిత్ర తత్త్వము వ్యక్తం చేయబడింది.

నాలుగో సర్గలో కవితామ కవిత్వం కోసం చేసిన చిరదీక్ష శిక్ష తపస్సమీక్షణ వలన ఆవేదనలను అనుభూతులను అర్థం చేసుకోవడం, విప్లవానికి అంకురార్పణ జరగడం, పురుషునికి ప్రేరక శక్తిగా సహచరిగా స్త్రీ ఔన్నత్యం వ్యంజింపబడింది.

ఐదో సర్గలో ఈ దేశపు దుర్భర పరిస్థితి చిత్రీకరించాడు. ఇక్కడ జీవితానికి గర్భస్రావమై కలలు అసహ్య రూపాలతో అసమగ్ర అవయవాలతో బయట పడుతున్నాయి.... నా దేశపు రాత్రులు గుండెలకు తగిలి పగులుతున్న గోడవలు, నా దేశపు దినాలు రాళ్ళకు తగిలి పగులుతున్న పడవలు అన్న ఆవేదనతో రాళ్ళ కన్నీళ్ళు వ్యాపించిన ఈ భూముల మీద ఇనప కండరాలు దేహం మీద సుళ్ళు తిరుగుతున్న మనిషిగా శ్రామికుడు రూపొందాలని ఆవేశంతో ఆక్రోశించాడు.

ఆరో సర్గలో సోదర కవులను చేతన తోటకివలాదే గొంతులతో, పద్యాల బందూకులు ధరించి యుద్ధ సన్నద్ధులు కావాలని ప్రబోధించాడు. నా దేశంలో నాయకత్వం నాదే, దాన్ని రాజకీయాల వారికి అప్పగించను అని వైజ్ఞానిక నాయకత్వ ఆవశ్యకతను చెప్పాడు. బానిసతనానికి అలవాటు పడుతున్న ప్రజానీకాన్ని "స్వేచ్ఛ మనిషికి మొదటి శ్వాస, అది నీ రక్తపు సజీవ బాష, భూమి విడిచి నీవు నీ చివరి అడుగు తీసేవరకు నిలుపుకోవలసిన ఒకే ధ్యాస" అని ఉద్బోధించి తిరుగుబాటుకు పురికొల్పాడు. "చెట్టు గనక పర్వతాగ్రా లెక్క తేత వేస్తే చెట్లు గుంపులు గుంపులుగా వస్తాయి... తిరస్కార సూచకంగా తలుపులు, దూలాలు, ద్వారబంధాలు, కుర్చీలు, బల్లలు, అన్నీ చెట్లుగా మారి బయటికి వస్తాయి. అరణ్యాల్లోకి పోతాయి." అని ప్రకృతి కూడా తిరుగుబాటు చేస్తుందని శ్రామికుడు తిరుగబడవలసిన ఆవసరాన్ని ప్రతీకాత్మకంగా చెప్పాడు

ఏడో సర్గలో రిక్త నాగరకతల ఆర్భాటం వివరించబడింది. ఎనిమిదో సర్గలో 'పొలాల మీద ఇంద్రధనుస్సు వంగింది, రా పోదాం కొడవళ్ళు దాల్చిన చేతులు ఎగరేస్తూ' అనడంతో విప్లవ విజయం సూచించబడింది. ప్రకృతి విజయం మానవతా శక్తి విజయంగా, ప్రేమ విజయంగా విశదీకరించబడింది.

ఈ కావ్యంలో కథ లేకపోవడం వలన వివిధానుభూతుల వ్యక్తీకరణలో వైచిత్రి వలన భావానుస్యూతి లోపించినట్లు కనిపించే అవకాశం ఉంది. కాని సునిశితంగా పరిశీలిస్తే విప్లవ ప్రబోధపరంగా క్రమానుస్యూతి గోచరిస్తుంది. "విజానికి ఒకటో సర్గలోని వతకమే రక రకాలుగా పునరావృత్తమై విస్తృత

పోతుంది మిగతా సర్గలో. ఇది కావ్యంలో లయ. వర్తులాలుగా సర్గలు సాగిపోతాయి. నీటిలో చిన్న రాయి విసిరినప్పుడు విస్తృత మయ్యే తరంగ వలయాల లాగ యితివృత్తం సర్గనుంచి సర్గకు విస్తరిస్తుంది."[12]

'ఆధునిక' అన్న పదం కాల సంబంధి పరిధులను సూచిస్తుంది. నవ్యత్వమన్న దానికి శాశ్వతత్వ లక్షణము ది.[13] నిత్య నూతనత్వం నవ్యతకున్న గుణం. ఆధునికత సమకాలిక, సామాజిక చైతన్య తత్త్వబోధకం. "పరిపూర్ణత కోసం నిరంతరంగా జిజ్ఞాసా ప్రధానుడైన మానవుడు కొనసాగించే చైతన్య ప్రస్థానం ఆధునికత. ఆధునికతలో సంప్రదాయ వివేకం వర్తమాన చైతన్యం భవిష్యదాశా స్వప్నమూ సమన్వయాన్ని పొంది ఉంటవి."[14] ఆధునిక ఇతిహాసానికి సమకాలికమైన సాంఘిక స్థితిగతులు వస్తువును అందిస్తాయి. సమకాలిక సాహిత్య చైతన్యం ప్రక్రియను ప్రసాదించి వినూత్న అభివ్యక్తికి అంతః ప్రేరణగా నిలుస్తుంది. అందుకే కాల ధర్మానుగతమై జగత్ప్రవృత్తి మారినపుడు వాఙ్మయమును మారు నిజము అన్నారు రాయప్రోలువారు.

ధర్మార్థ కామ మోక్షాలను అపేక్షించడం ప్రాచీనేతిహాస లక్షణం. ఈ ఇతిహాసంలో సామ్యవాద సిద్ధాంత ఆచరణనే ధర్మంగా, శ్రామికుడు శ్రమకు తగిన ఫలాన్ని పొందడం ఆర్థికమైన న్యాయంగా శ్రమించే రంగంలో రమించే రంగంలో స్త్రీ పురుషుల సాహచర్య జీవన మాధుర్యమే కామంగా, సమసమాజమనే మరో ప్రపంచానికి చేసే మహాప్రస్థానమే మోక్షంగా ధ్వని పూర్వకంగా చెప్పారు శేషేంద్ర

ఆదిమ వ్యవస్థలో స్త్రీ పురుష సంబంధాలలో స్వేచ్ఛ ఉండేది. క్రమ పరిణామంలో కుటుంబ వ్యవస్థ ఏర్పడడంతో పరిస్థితులు మారాయి. శ్రమ విభజన జరగడం వలన స్త్రీ గృహిణి కాగా పురుషుడు యజమాని అయ్యాడు. గృహ నిర్వహణకు ఆహార సంపాదనకు సంబంధం తగ్గిపోవడం వలన స్త్రీ పాత్ర అప్రధానమైపోయింది. పురుషుడు ఏర్పరచిన నియమాలు, అధికారం పెరిగిపోయి స్త్రీ పురుషునికి ఆనందాన్నిచ్చే వస్తువుగా మారిపోయింది. క్రమంగా స్త్రీలకు విద్య అందుబాటులోకి రావడం తద్వారా వారిలో నూతన చైతన్యం కలిగింది. సామ్యవాద ఆచరణలో స్త్రీలకు గణనీయమైన స్థానం ఉంది. ప్రస్తుత ఇతిహాసంలో మానవ జీవిత రంగంలో స్త్రీలకు ఉన్న ప్రాధాన్యత నిరూపించబడింది. పురుషుని సృజనాత్మక కార్యకలాపాలకు ప్రేరకురాలుగానే కాక సమ సమాజ సాధనలో పురుషునితో సమానమైన పాత్ర నిర్వహించే స్వతంత్ర శక్తిగా వ్యక్తీకరించాలన్న దృష్టితో సోషలిస్టు దృక్పథంలో ప్రేమను ప్రవేశపెట్టాడు.[15]

"నా బ్రతుకు నీవనే ఒక నాజూకు మాలపోగుల కాలంతో,
అల్లిన దుకూలం-భార్యగా, నెచ్చెలిగా, ప్రేయసిగా, మాతృ
దేవతగా, చంటిబిడ్డగా ఒకటేమిటి నా సర్వస్వంగా"

పురుషునికి జన్మనిచ్చి మాతృమూర్తిగా ఆ తర్వాత జీవన సహచరిగా చైతన్యాన్ని రేపి చరితార్థమవుతుంది స్త్రీ

"సత్యానికి సౌందర్యానికి సంగమ తీర్థం స్త్రీ, సౌందర్యంలో సత్యాన్ని అన్వేషించడానికీ, సత్యాన్ని సౌందర్యంగా సందర్శించడానికీ సృష్టి సమర్పించిన కళాఖండం స్త్రీ. ఆమెను కళా దృష్టితో ఆరాధిస్తే కవితగా జాలువారుతుంది; కామదృష్టితో చూస్తే మోహాంగా మోహరిస్తుంది; ప్రణయ దృష్టితో పరిశీలిస్తే భక్తిగా పరిణమిస్తుంది; ధర్మ దృష్టితో దరికి చేరితే శక్తిగా సహకరిస్తుంది; తత్త్వ దృష్టితో ఉపాసిస్తే అమృతమూర్తిగా అవతరిస్తుంది; స్త్రీలో పురుషుడు అందుకునే అనుభూతి ఉంది; అందుకోవలసిన పరంజ్యోతి ఉంది."[16]

"రా, మనం ఇద్దరమవుదాం: భూమి మీద పాటల జల పాతంలా దూకుదాం. మన ప్రజల కలల పువ్వుల్ని పడవల్లా మోసుకు పోదాం. వాటి గమ్యాలకు చేరుద్దాం. ఈ ప్రగాఢ ప్రేమమయ సమయంలో మనమిద్దరమూ ఒకే బాష్ప బిందువవుదాం. మానవత పాదాల మీద వాలుదాం."

దీనిలో ప్రేయసి కేవలం ఊహా ప్రేయసి గాదు. దీనిలోని ప్రేమ అహంకార ఆవాదకం కాదు. శారీరక తృష్ణగా పర్యవసించదు. సర్వ చరాచర సృష్టిజాలాన్ని ప్రేమించడం నేర్పుతుంది. సోషలిస్టు సమాజ నిర్మాణ కృషిని పరిపూర్ణం చేస్తుంది. "మానవ జీవితంలో అందులోనూ శ్రామిక జీవనంలో ప్రేమ ఎంతో అందమైన పాత్ర వహిస్తుంది. ఎంతో శక్తిమంతమైన పాత్ర వహిస్తుంది. స్త్రీ పురుషులు సమానంగా కలసి మెలసి సామాజిక జీవనంలో పాల్గొనే కళాత్మక చిత్రాలు అందివ్వడమే ఉత్తమ ధర్మమూ, సామాజిక ప్రగతికి దోహదకారి అకృత్రిమ ప్రక్రియా ఔతుంది." అన్నాడు శేషేంద్ర.[17]

"సోషలిజం నిర్మాణం కొరకు నేలను శుభ్రం చేయడానికి మనమిప్పుడు గురుతరమైన సన్నాహాలు చేస్తున్నాం, కానీ మన స్త్రీలు సంపూర్ణ సమానత్వాన్ని సాధించినప్పుడు మాత్రమే ఆ హీనమైన, మూర్ఖతాపాదకమైన, అనుత్పాదకమైన పని నుండి విమోచన పొందిన స్త్రీలతో కలసి కొత్త పనికి మనం పూనుకొన్నప్పుడు మాత్రమే సోషలిజం నిర్మాణం ప్రారంభమవుతుంది." అన్నాడు లెనిన్.[18]

ప్రాచీన కావ్యాలలో నగరార్ణవ శైల ఋతు చంద్రార్కోదయాది వర్ణనలు సాధారణంగా ఇతివృత్త సంబంధ విరహితాలై కని పిస్తాయి. ఈ ఇతిహాసంలో స్థావర జంగమాత్మకమైన ప్రకృతి, ప్రతీకలుగా ప్రయోగించబడి కావ్య పరమార్థ వ్యంజకాలైనాయి

ఈ విధంగా ఈ ఆధునిక ఇతిహాసం ఆధునిక యుగ చైతన్య ప్రతిపాదకమైన వస్తువుతో, ప్రాచీనేతిహాస లక్షణాలు అంతస్సూత్రంగా స్వీకరించి వర్గ సంఘర్షణ సిద్ధాంతానికి సమన్వయాత్మకమైన ప్రక్రియలో సాగింది. "ఐతిహాసిక స్ఫూర్తితో నిర్వహించేవస్తువుకు ప్రతీకాత్మకతను సంపాదించడం ఆధునిక కవిత్వంలో అగ్రగాములు అందించే శిల్ప ప్రస్థానం; కావ్యమంతా ఒక వస్తావకర్త చేసే ప్రయోగం "[19] ప్రాచీనేతిహాసానికి ప్రతీకాత్మక ప్రవృత్తి మానవుడు కేంద్రంగా భౌతిక ప్రపంచ ప్రాధాన్యాన్ని వివక్షిస్తూ విశ్వజనీనతను సాధించడానికి వినియోగించబడింది

ఆధునిక ఇతిహాసకర్త యుగయుగాల సంప్రదాయ విశ్వాసాలతో శాస్త్ర సాంకేతిక రంగాలలో సాధించిన విజయాల ప్రభావాలతో హేతువాదం పునాదిగా ప్రపంచించబడిన వివిధ సిద్ధాంతాల ప్రభావాలతో సంఘర్షణ ఆలవాలమైన నేటి మానవుని జీవితాన్ని వివిధ కోణాలలో సునిశితంగా పరిశీలించ గలిగిన ప్రతిభా వ్యుత్పత్తులు కలవాడై ఉండాలి

ప్రాచీన ఆధునిక సాహిత్యాలను అవలోకనం చేసి అభివ్యక్తిలో ఆధునికతను సంపాదించడానికి అభ్యాసం చేసిన వాడై ఉండాలి అందుకే మహా కావ్యకర్తకు 'మెచ్యూరిటీ ఆఫ్ మైండ్', 'మెచ్యూరిటీ ఆఫ్ మానర్', 'మెచ్యూరిటీ ఆఫ్ లాంగ్వేజ్' అవసరమన్నారు. టి యస్ ఇలియట్ [20]

"ఇతిహాస నిర్మాణానికి బాధాపూర్వక బలి కావాలి, చేసే ఆ బలి నా వయస్సు, నా పాండిత్యం, నా ప్రతిభ, నా అనుభవం సర్వం పిండి మాటల గొంతుల్లో పోసి నా రక్త ఈ ఇతిహాసం. ప్రపంచ మానవులు, వాళ్ళ చరిత్రల్ని, వాళ్ళ జయాపజయాల్ని, వాళ్ళ భూత భవిష్యద్వర్తమానాలనీ అన్నిటినీ అనుభవ జ్ఞాన నేత్ర ద్వంద్వంతో అవలోకన చేసి ఆ విశ్వదృశ్యం నుండి ఈ తాత్పర్యం తీశాను. ఇది ఈ శతాబ్దం ఇచ్చిన పాట శేషేంద్ర మాటలు ఆయన అహంకారాన్ని కాక ఆత్మ విశ్వాసాన్ని తెలుపుతున్నాయి

"ఎపిక్ టు మి ఈజ్ ది మ్యూజిక్ దట్ స్టెంటోరియస్
వాయిస్ విచ్ సింగ్స్ ఎట్ ఇట్స్ హై, ది జర్నీ ఆఫ్
మ్యాన్ ఆన్ అవర్ ప్లానెట్ "[21]

సూచికలు :


1) కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ అండ్ ప్రేమానంద కుమార్ : ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇంగ్లీష్ లిటరేచర్, పేజీ-127.

2) కావ్య మీమాంస 2 - 8.

3) జి వి. సుబ్రహ్మణ్యం : ప్రథమాంధ్ర మహా పురాణము, పుట-35

4) పైది. పుట-35.

5) 'సందిది' త్రైమాసిక పత్రిక, జూలై-1981.

6) నా దేశం నా ప్రజలు, ముందుమాట, పుట-1.

7) ఈ తాత్పర్యం [నా దేశం నా ప్రజలు, ముందుమాట నుండి గ్రహించాను.]

8) దండి : కావ్యదర్శ, పుట - 8, 9

9) నా దేశం నా ప్రజలు ముందుమాట నుండి గ్రహించాను.

10) వీరేంద్రకుమార్ జైన్ : అఖిల సుబ్రహ్మణ్యం (సంపా): యుగకవి శేషేంద్ర పుట-1.

11) నా దేశం నా ప్రజలు (ఎమెస్కో)-ముందుమాట, పుట-13.

12) ఆర్ యస్. సుదర్శనం అఖిల సుబ్రహ్మణ్యం(సంపా.) యుగకవి శేషేంద్ర, పుట-9.

13) "యావ్యాపారవతీ రసాన్ రసయితుం కాచిత్ కవీనాం నవాదృష్టి / పరేశి క్షణే క్షణే మాతనై జగత్యామాత్ర యంతీ" - అభినవగుప్తుడు

14) సుప్రసన్న ఆధునికత - ఒక వివేచన (వ్యా.), 'సాధన' మాస పత్రిక, జనవరి, ఫిబ్రవరి - 1980.

15) మొదటిసారిగా తెలుగు కవిత్వంలో నా దేశం నా ప్రజలు కొన్ని వర్గాల్లో శోషరిస్తు దృక్పథంలో ప్రేమను ప్రతిపాదిస్తే దాన్ని వీరపచా బకాసురుల వంటి పోయిటీ నిర్వచించారు కవిసేన మేనిఫెస్టో, పుట 138.

16) జి వి సుబ్రహ్మణ్యం అభివ లోచనము పుట - 56

17) కవిసేన మేనిఫెస్టో, పుట - 136.

18) సాహిత్య ఉద్ధరణ - పుట-65.

19) జి వి సుబ్రహ్మణ్యం 'సువర్ణ తిలకం'(వ్యా) నారాయణ రెడ్డి 50వ జన్మదినోత్సవ సంచిక, పుట-18.

20) ఆన్ పోయెట్రీ అండ్ పోయెట్స్, పేజీ-59.

21) శేషేంద్ర శర్మ : ఇన్ డిఫెన్స్ ఆఫ్ పీపుల్ అండ్ పోయెట్రీ, పేజీ - 37

# ఘంటారావం

## శ్రీ సోమసుందర్

అదే ప్రభాత మంత్రం, ఘంటారావమై
ఈ చరమ దశాబ్దానికి స్వాగత గీతమై
ఆగామి శతాబ్దానికి ఆహ్వాన సంగీతమై

కాలం - కరవాలమై, ప్రచండ తేజో విస్ఫారితమై
ఇరులను పోగుపెట్టిన వర్తమాన తరువుల నీడలలో
కృతక దారిద్ర్యాల్నీ, కృదంత అధికార దాహాల్నీ
పరిమార్చే ప్రభాత మంత్రమై - ప్రశాంత తంత్రమై ....

మందాకినీ తరంగ మాలికల మందాక్రాంత గానమై,
గోదావరీ సరిత్పూర్ణ విమలోల్లాస లాస్యమై,
సమస్త నదీమ తల్లుల సలలిత సలిల తరంగమై,
అదే ప్రభాత మంత్రం - అభినందన మంగళాచరణమై ....

నా జాతి జనుల నరాలకే జల వేగా లందిస్తూ
ప్రభాత పోకార్చే నవయుగ తాండవకేళీ స్పందనమై,
ఆకలినీ కన్నీళ్ళనీ కడగండ్లనీ తొలగిస్తూ
జవసత్త్వా లందించే జలశక్తి ప్రస్ఫుట నాదమై ....
ఇదే చరమ దశాబ్దపు రుచిర ఘంటారావం!

మునివాకిట గులాబి పొదపై వాలిన బుల్‌బుల్
వినిపించే ఆహ్వాన గీతం సాక్షిగా....
శిశిరపు పొలిమేరల గళం సద్దుకుంటున్న కోకిలల సాక్షిగా-
ఆహ్లాదానికి ఆహ్వానం పలుకుదాం....

దారి పొడుగునా పూసిన నారింజలు
మన తలలపై కురిసే పున్నాగల పరిమళ కిరణాలు
అరుణోదయ ఆశ్లేషంతో సురభిళించే సుర పొన్నలు
నిజం సుమీ పుష్పాలు కుతంత్రాలు తలపెట్టవు!
ఎన్నడూ చెట్లు అసత్య వాగ్దానా లందించవు!
సువాసనల కోసం చెట్ల నీడల నివసించే
సర్పాలే రెండు నాల్కల వంచకులు....

ఆగామి శతాబ్దపు నవ్య విభాతంలో
పొన్నచెట్టు కొమ్మల క్రీనీడలలో
దొంగ చీరలు వసేమిరా ప్రేలాడవు
ఎప్పుడైనా పరే వర సతుల మానాలతో
పరిహాసా లాడలేదు!

తాళి ఎన్నడూ ఎగతాళిగా మారబోదు!
రెక్కలు మొలిచిన కాలాన్ని ఇక్కడే బంధించి
రెక్కలు మొలిచిన కాలాన్ని యిప్పుడే ఎగరేదాం!

వర్తమాన కవితా దర్పణంలో నీ ప్రతిబింబం
శతధా విచ్ఛిన్నమై పోయిందని-
[illegible] శతాబ్దం నీ కందించిన స్వప్నాలు
పాదరసం బిందువులై విశీర్ణమై పోయాయని
గుండెలు కుంపట్లుగ కుమిలిపోవడం పనికిరాదింక!
గడుస్తున్న కాలంలో ప్రతి ఉదయమూ
పరాగాలకు రాగాలున్నాయని భ్రమ పెట్టింది,
పురాకృతాలు అనురాగబంధా లనుకుంటూ
పరవసించింది! విషతిక్త కషాయాల విధుర సంధ్యా యవనికలు
కొత్త పల్లవి ఆలపిస్తాయని నిరీక్షించింది....
కాని మానవ వంశం విహ్వాలిత బింబమై పోయింది-
ఎండిపోయిన వెదురు బిడెమై - పర్వానికీ పర్వానికీ నడుమ
సార రాహిత్యం అనుభవించింది!
ఆశా సంకల్పం శీర్ణ వృక్షంగా ప్రసరించింది-
ఈ శతాబ్ది మూగ వేణువుగా
సుస్వరాలను ఆయత్తమొనర్చుకొన్నా-
ఆలాపన స్తంభించి పోయింది!

కిసలయ [illegible] అగ్ని స్నాతమై పోయాయి విన్న,
సజీవ సమాహారం [illegible] భస్మ రాశిగా మారింది విన్న
[illegible] ప్రసక్తి ఇంకా లేవలేదు!
[illegible] విహంగ[illegible] - సుహాసమై [illegible]రియలేదు....

ఈ హత్యాకాండల పిట ప్రాంగణాలు విస్మరించు
త్వరాగమనం వంటి ఈ [illegible]యలో
వసుమతి నవ వధువై నిలుస్తుంది నీ ప్రోల-
నీ కోసమే [illegible]చ్చిన [illegible] పల్లకీ
హిందోళ రాగచ్ఛాయలో మెరుపు లందిస్తోంది!
ఇంద్రచాప సుందరి రూపమై గుమ్మంలో నిలచింది!

విరహ మెరుగని ఊహాంచలాలలో
రంగు రంగుల మేఘాలు ఆలపిస్తాయి మోహన రాగం!
విచ్చేసింది నేడే ప్రభాత మంత్రమై ఘంటారావం!!
మన సమీప గతం శావ దగ్ధమై వివర్ణమైంది
ప్రతి రోడ్డూ కన్నీటి మడుగులో మునిగింది
కుల కార్పణ్యాల సంకుల బీభత్సాలు
వికల స్వప్నాలు ముంచిన సుడిగుండాల వ్యాకులం
ప్రతి సుందర భవనమూ విహ్వలించింది నౌకాభంగమై
చిగురించిన పచ్చని చెట్టు చిటారి కొమ్మలలో
మధుపాలు నిర్మించుకొన్న మధుకోశాలు
మాడిపోయి డుల్లిపోయాయి కులాగ్ని జ్వాలల్లో!
విద్యుల్లతా చేలాంచలాల జలదాంగనలు
విశీర్ణ హృదయాల సురభిళ నీరాజనాలు-
విధుర జీవన పరాభూతులైన శూన్య గగనాలు
గత వైభవాల దీప నిర్వాణ గండాలు....

ఇప్పుడే ఉద్వాసన పలుకుదాం - విషాద కంఠాలకు!
ఇప్పుడే ఆయత్త మవుదాం - ఆరోగ్య స్నానానికి!!
ఆనంద గానానికి....
చైతన్యం - సమైక్యం, జన విప్లవ చరణాలై
ఈ వనాంతర పాదపాల సన్నిధిలో
ప్రతి కుట్మల వినాళంలోనూ ఆశా వర్తిత భృంగ సమూహమై-
కవితా గంధమాదనంపై గళ మంజూషల భద్రాసనం!
సురభిళ పవమానాల స్మితరేఖల ఆవిర్భావం!
కారుణ్య కల్పద్రుమ ఛాయలలో ఏకాంత సంగీతం....
ఇదే నవ్య ప్రభాత మంత్రమై
నూత్న శకారంభ ఘంటారావమై
నవ మానవ హృదయ తోరణమై
స్వప్నమై ...
గానమై ....
కావ్యమై ....

---

## వంచనా శిల్పం

అస్తవ్యస్తమైన కథలా
ఉంది జీవితం_
ఆమనితోనే మొదలయింది కథ
కానీ --
అర పేజీ దాటిందో లేదో
అప్పుడే మొదలయింది టార్చర్!
కవిత్వంలో 'పటుత్వం' తప్పింది.
పాత్రలు రెండూ విభిన్నాలు-
మిగతా పాత్రలన్నీ చెల్లాచెదురయి
కైపో సర్వ నాశ మయింది.
మలుపులు మాత్రం ఉన్నాయి-
సస్పెన్స్ పొర కప్పుకొన్నా
ముగింపు, సర్వచ[illegible]స్న కోల్పోతోంది.
అందుకే___
కనబడే ప్రతి బండరాయి
శిల్పం కాదన్నారు --
ఈ కథను ఏ పాఠకులు ఆదరిస్తారని?

శ్రీ పురిజాల సుధాకర్

## ఏముందని?

రాళ్ళల్లో
ఏముందని
కళ్ళప్పగించి చూస్తావు వాటికేసి - -
రాలిపోయిన
ఆకుల్లో
ఏముందని
ఆలోచిస్తూ కాలం గడుపుతావు
వాటిని గురించి___
బీటలు వారిన
భూముల్లో
ఏముందని
వెదకుతావు లోతుగా వాటిల్లో___
గడ్డి మొక్కలు
పూచిన పువ్వుల్లో
ఏముందని
బంగారంలా మురుసుకుంటావు
వాటిని కోసుకుని___

శ్రీ ఉమ్మిటి విఘ్నేశ్వరరావు

# చలి చీమలు

## శ్రీ కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు

కర్మాగారంలో ఓ యంత్రం తయారయితే అది ఏదో ఒక పని మాత్రమే చేయగలుగుతుంది. కానీ ఆడది అనే యంత్రం అలా కాదు. అన్ని పనులు చేయగలుగుతుంది. చెయ్యాలి కాబట్టి. చేయలేనినాడు ఆ యంత్రాన్ని కన్‌డెం చేసి మరో యంత్రం తెస్తాడు మగాడు. 'కార్యేషు దాసి, కరణేషు మంత్రి' — అని చెబుతూనే ఆడది చెయ్యాల్సిన అష్టావధానాన్ని గురించి చక్కగానే నిర్దేశించారు.

ఆరడీలు

ఢబాయింపులు

దిగమింగే

యంత్రం ఈ సృష్టిలో ఒక్క ఆడదే. ఈ యంత్రం పవితనాన్ని బట్టి ఎన్ని అందమైన పేర్లు సృష్టించారు మగ రచయితలు.

"కామిని"

కుత్సిత మనోభావాలకు ప్రతీకగా మగవాడు ఆమెకు పెట్టిన మరో ముద్దు పేరు.

అర్ధాంగే కాదు వెలయాలు కూడా ఎప్పుడూ తన కామాన్ని గురించి చెప్పుకోదే! అలాంటప్పుడు ఆమెను, 'కామిని' అని ఎలా అనగలిగాడు.

ఆమె అధరాలు మధుపాత్రలని, ఆమె కళ్ళు కైపెక్కించే మధువని, ఆమె క్రీగంటి చూపులు మన్మథ బాణాలని ఆమె పరిష్వంగం తూగుటుయ్యాలని వర్ణిస్తూనే తన ఆటవిడుపుకు ఆలంబనగా ఉపయోగించుకుంటూ వచ్చారు. తనకు ఆపాదించిన ఉపమానాలకు తను ఎక్కడ తులతూగలేకపోతానో అని క్షణం క్షణం కృంగిపోతూనే పురుషుణ్ణి సంతోష పెట్టేందుకు సదా సర్వదా ఆమె ప్రయత్నం చేస్తూనే ఉంది.

"సవితా!" అంటూ అర్ధాంగిపై చెయ్యి వేశాడు కేశవరావు.

కాలసర్పం బుస గొట్టినంత భయపడింది సవిత. అయినా భయం బయట పడనీయలేదు.

"సవితా! ఎంతసేపు చెప్పాలి" అంటూ మరి కాస్త దగ్గరకు జరిగాడు.

అయినా ఆమెలో చలనం లేదు. బటన్ నొక్కగానే అదే యంత్రంగానే ఇంతకాలం ఆమె ఉపయోగపడుతూనే వచ్చింది. కానీ ఈ మధ్యే ఆమెలో ఆ శక్తి నశించిపోయింది తనకు ఓ మనసు ఉందనీ అది ఎదురు తిరుగుతుందని గ్రహించగలిగింది. అందుకే ఆమె ఉలకలేదు, పలకలేదు. ఆమె ఆలోచన్లు తెగలేదు.

మృష్టాన్న భోజ్య పదార్థాలు చేసేందుకు ఓ వంటమనిషి

సపర్య చేసేందుకు ఓ దాసి

'ఆకలి' తీర్చేందుకు ఓ రంభ

మగవాడికి కావాలి.

'ఆల్ ఇన్ వన్'గా పనిచేస్తున్న ఒకే ఒక యంత్రం ఆడదిగా గుర్తించారు మగాడు. ఆమెను అలాగే మలచాడు.

పలుపుతాడు కట్టించుకున్న పశువైన ఎప్పుడో ఒకప్పుడు తల విదిలిస్తుంది. పసుపుతాడు కట్టించుకున్న ఆడది అలా కూడా చెయ్యటానికి వీల్లేదు. తాళి కట్టించుకున్న పాపానికి ఈ దేశంలో ఎంతమంది అర్ధాంగులు ప్రతి రాత్రి 'రేప్' చేయబడుతున్నారో ఈ చరిత్ర పుటలలోకి ఎక్కలేదు. తనకు ఇష్టం లేకుండా జరిగే ఏ కృత్యమైన అకృత్యమే. 'రేప్' గానే భావిస్తుంది ఆడది. అందుకే సవిత ఈ రోజు ఎదురు తిరగాలని నిశ్చయించుకుంది.

కేశవరావు ఒంటికాలుపై లేచాడు. ఆమె వినయంగానే ప్రక్కకు తొలిగింది.

'పగలు చేసిన పాపం రాత్రితో సరి' అంటూ ఆమెను మరికాస్త సమీపించాడు. సవితకు ఆ ద్వంద్వార్థం కంపరం కలిగించింది. ఆమె నిలదీసి అడగాలని నిశ్చయించుకుంది.

"జరిగినదానికి మీరు క్షమాపణ చెప్పాలి. అప్పుడే మీరు ఆశించింది పొందగలుగుతారు." ఖండితంగా చెప్పింది.

'క్షమార్పణ' మాట వినగానే కేశవరావ్ బాంబు పడ్డట్టు ఉలిక్కిపడ్డాడు. భర్త భార్యకు 'క్షమార్పణ' చెప్పటమా! ఇంత

వరకు ఏ భర్తా ఏ భార్యకూ అలా చెప్పిన దాఖలాలు లేవే! ఇంత అసందర్భంగా మాట్లాడుతుందేమిటీ? అనుకున్నాడు

"భార్యా భర్తల మధ్య క్షమార్పణ ఏమిటి?" గంభీరంగా అన్నాడు

"ఏం భార్యాభర్తలయితే మాత్రం మనుషులు కారా! తప్పు చేసినవారు క్షమార్పణ చెప్పటంలో న్యూనతా భావం ఎందుకు?

సవితి అన్న మాటల్లో యదార్థం ఉందని కేశవరావుకు తెలుసు. తన జీవితంలో చాలాసార్లు 'సారీ' చెప్పాడు

"కేశవరావుగారూ!" మిమ్మల్ని అయ్యగారు రమ్మంటున్నారు. అటెండర్ చెప్పాడు

అటెండర్ మొహం చూడగానే కేశవరావుకు యమభటుడు గుర్తుకు వచ్చాడు. అసలే ఆఫీసర్ చండ శాసనుడు. మిమ్మల్లో ప్రొద్దు ప్రుంగిన మొహం వాడూనూ అనుకుంటూ చూస్తున్న ఫైలు ప్రక్కన పెట్టి గబగబా ఆఫీసరు గదిలోకి వెళ్ళాడు. వినయంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు. ఆఫీసరు తల వంచుకుని ఏదో ఫైలు చూస్తున్నాడు. కన్నెత్తి కేశవరావువైపు చూడలేదు కొంచెంసేపు వెయిట్ చేసి కేశవరావ్ సన్నగా దగ్గాడు. అలాన్నా తనవైపు చూస్తాడని ఆతని ఆశ.

"ఏమోయ్ కేశవరావ్! ఎంతసేపు అయింది వచ్చి?" ఉపోద్ఘాతంగా అన్నాడు.

"వదిలోపే వచ్చాన్ సార్! వినయంగా సమాధానం చెప్పాడు.

"ఆఫీసుకు ఎప్పుడు వచ్చావని కాదు నేను అడుగుతా! ఈ గదిలోకి ఎప్పుడు వచ్చావు అని?"

"చాలాసేపు అయిం ది సార్!"

"అయితే ఎందుకు చెప్పలేదు? ఓహో నేను ఏ ఫైలు చూస్తున్నానని....?" సందేహంగా అన్నాడు

"లేదు సార్! జస్ట్ అలా నిలబడ్డాను మీరు చూస్తారు కదాని".

"నేను కాన్ఫిడెన్షియల్ ఫైలు చూస్తున్నానని తెలియదా? తెలిసే రహస్యాలు తెలుసుకుందామని తొంగి చూస్తున్నావా?"

"నో సార్! నో! నాకు అలాంటి ఉద్దేశ్యం లేదు సార్!"

"నాకు తెలుసు నా మొగుడు నన్ను గూటిస్తూ మెమో ఇస్తే ఎలా చివాట్లు పెట్టాడా చూద్దాం అని నువ్వు దొంగ చూపులు చూస్తున్నావు."

"కాదు సార్! మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యటం యిష్టం లేక మెదలకుండా నిలబడిపోయాన్ సార్!"

"ఆల్‌రైట్! నువ్వు చూసినా చూడకపోయినా ఈ రిపోర్టు నువ్వు చూడాల్సిందే! ఇదేమిటో తెలుసా?"

"నో సార్! తెలియదు!"

"తెలుసుకోవాలోయ్. ముఖ్యంగా నువ్వు తెలుసుకోవాలి. నా మొగుడు అంటే మన యం. డి. నాకు అక్షింతలు వేస్తూ రాసిన లవ్ లెటర్ అంటే ముద్దు ముద్దుగా ముక్కు చివాట్లు పెడుతూ యిచ్చిన మెమో!" అంటూ ఆఫీసర్ పీతాంబరం వెర్రి మొహం పెట్టాడు

యం డి. గారు ఆఫీసర్‌ని తిడితే అందుకు తనెందుకు బాధ్యుడో కేశవరావుకు అర్థం కాలేదు. అయినా పైకి ఎలా అనగలడు?

"నువ్వు చేసిన నిర్వాకం అంతా ఇలానే ఉంటుంది కేశవరావ్! అర్జంట్ ఫైల్ త్వరగా పుటప్ చెయ్యాలి అని నీకు చెప్పానా? అది ఇంతవరకు అఘోరించలేదు అది ఎందుకు పంపలేదు అంటూ ఆయనగారు కోతి రాతలు రాసి నన్ను సంజాయిషీ అడుగుతూ శ్రీముఖం పంపాడు."

"నేను మీరు చెప్పగానే ఫైల్ పుటప్ చేశాను సార్!" వంగి వంగి వినయంగా సమాధానం చెప్పాడు.

"మరైతే ఏమయినట్టు ఆ ఫైల్ పైకి ఎందుకు పంపలేదు?"

"సంతకానికని మీ టేబుల్ మీద పెట్టాను సార్. 15 రోజులయింది మీరు బిజీగా ఉండి సైన్ చెయ్యలేదనుకుంటా?"

"అపును బిజీగా ఉన్నాను. సంతకం పెట్టలేదు ఫైల్ టేబుల్ మీద పెట్టగానే సరిపోయిందను కుంటున్నావా? ఈ కీకారణ్యంలో ఆ ఫైల్ ఎక్కడ పడి ఉందో! చూడు ఈ టేబుల్ నిండా ఫైల్సే? ఎన్నని చూడను " అంటూ టేబుల్‌పై ఉన్న ఫైళ్ళని చిందరవందర చేశాడు. ఆయన చెయ్యి విసురుగా తగలటం వల్ల ఒకటి రెండు ఫైల్స్ క్రింద పడ్డాయి వాటిని తీసి కేశవరావ్ మళ్ళీ టేబుల్ మీద పెట్టాడు

"ఏం మాట్లాడవేం? ఏమిటి నీ ఎక్స్‌ప్లనేషన్. ఫైల్ మీద సంతకం అయిందో లేదో చూడాల్సిన బాధ్యత నీకు ఉందంటావా? లేదా?"

"ఉంది సార్!"

"మరైతే ఎందుకు నా సంతకం తీసుకోలేదు? ఎందుకు డిస్పాచ్ చేయించలేదు. ఇప్పుడు నీకు మెమో యిస్తాను. నీ సమాధానం సంతృప్తికరంగా లేకపోతే నిన్ను సస్పెండ్ చేస్తాను. ఆ తర్వాత పైకి రాస్తాను. ఆ తర్వాత ఎంక్వయిరీ జరుగుతుంది. ఆ పైన నీ ఉద్యోగం ఊడుతుంది. లేదా శంకరగిరి మాన్యాలకు పంపుతారు. అప్పుడు కళ్లు తెరుస్తావు? అవునా?

"లేదు సార్! సారీ సార్! తప్పయిపోయిండి. ఇంత జరుగుతుందని నేను అనుకోలేదు. ఏదో పనుల ఒత్తిడిలో నెగ్లెక్ట్ చేశాను. ఇకముందు అలా జరగదు సార్! ఈసారికి క్షమించండి సార్! అయాం వెరీ వెరీ సారీ!" అంటూ ప్రాధేయ పడుతూంటే కళ్ళనీళ్ళ పర్యంతం అయింది కేశవరావుకు

"సరే! నువ్వు ఇంత కాలం ఎంతో సిన్సియర్‌గా పని చేశావు కాబట్టి ఈసారికి ఇలా వదిలేస్తున్నాను. ఇకముందు కాస్త జాగ్రత్తగా వర్క్ ఎటెండ్ అవుతూండు. లేకపోతే చిక్కుల్లో పడతావ్" అంటూ హెచ్చరించాడు.

కేశవరావు దిగులుగా వచ్చి సీటులో కూర్చున్నాడు. ఆ రోజంతా ఏమీ పని చెయ్యబుద్ధి పుట్టలేదు.

ఎంతసేపు ఆలోచించినా తన తప్పు ఏమిటో అర్థం కాలేదు. ఆఫీసర్ చెప్పిన పని వెంటనే చేశాడు. ఫైల్ టేబుల్ మీద కూడా పెట్టాడు. ఆయన సంతకం చేయకపోతే తన తప్పు అంటాడేమిటి ఆ భ్రష్టుడు? చెయ్యని తప్పుకు తను బాధ్యత వహిస్తూ క్షమించమని అడిగాడు. అప్పుడుగానీ ఆఫీసర్ ముండా వాడు వదల్లేదు.

ఈ ప్రపంచంలో ఎంత దోపిడి జరుగుతోంది!

ఇలా అనుకుంటున్న కేశవరావ్‌కు తెలియని విషయం ఒకటుంది. అది ఏమిటంటే తనూ ఈ దోపిడి వ్యవస్థలో భాగస్వాముడుగా ఉన్నాడన్న నిజం తెలియదు. తనూ యిలా ఎంతమందిని చెయ్యని నేరానికి శిక్షిస్తున్నాడో కేశవరావ్‌కు తెలియదు. ఆ విషయం అతని భార్య సవితకు బాగా తెలుసు.

తను సుఖంగా గడిపిన రోజులు ఎన్ని? అని సవిత ప్రశ్నించుకున్నప్పుడల్లా ఎప్పుడూ సమాధానం దొరికేది కాదు. ముఖ్యంగా పెళ్ళయిన తర్వాత ఒక్కరోజు కూడా సుఖపడ్డానని ఆమె అనుకోలేదు.

పెళ్ళి చేసుకొన్న మగవాడు పెళ్ళి చేసుకోని ఆడది సుఖపడతారు. మగవాని సుఖాలకు ఎక్కడ లోటు వస్తుందో అని ఈ వ్యవస్థలో ఆడదానికి పెళ్ళి అవసరం అని నొక్కి చెప్పారని సవిత ఖచ్చితమైన అభిప్రాయం.

ఝాము పొద్దు ఉండగా లేచి కాఫీ కలిపి ఫ్లాస్కులో పొయ్యడంతో మొదలవుతుంది దినచర్య.

పిల్లలిద్దరిని బెదిరించి లేపేందుకు సగం అలిసిపోతుంది.

"మమ్మీ! రాత్రంతా ఏవో పిచ్చి పిచ్చి కలలు. ఇప్పుడే కాస్త నిద్ర పట్టింది. కాసేపు పడుకుంటాను మమ్మీ!" అంటూ మారాం చేస్తాడు పెద్దవాడు రవి.

"మమ్మీ! రాత్రి నేను ఒక గంటసేపు ఎక్కువ చదువుకున్నాగా. మరో గంట పడుకుంటేగానీ నిద్ర చాలదు" అంటాడు చిన్నవాడు వాసు.

పాపం పిల్లలు అలసిపోయారు అనుకుని 'అలానే' అంటూ మళ్ళీ పనిలో పడుతుంది.

పనిమనిషి ఒకరోజు వస్తే మర్నాడు నాగా పెడుతుంది. అదేమిటని గట్టిగా అంటే "ఇరిచ్చే ముష్టి అరవై రూపాయలకు నేను కాబట్టి ఉదయ సాయంత్రం బండెడు గిన్నెలు తోముతున్నాను. ఇదే కూలికి పోతే రెండు రోజుల్లో సంపాయిస్తాను" అంటూ బెదిరిస్తుంది. పనిమనిషి సెలవుగానే మానేస్తే ఏం చేస్తుందేమోనని భయంతో వేడి వేడి కాఫీ ఫ్లాస్కు లోంచి గ్లాసులోకి వంపి నింపాదిగా అంటుంది. "ఉత్తాలా! ఇప్పుడు నేనేమన్నాననీ? ఏదో ఆఫీసు వున్న రోజుల్లో వస్తే చాలు. శలవు రోజు ఎలానూ నేనే తోముకుంటాను." అంటూ నచ్చచెబుతుంది. ఫిల్టర్ కాఫీ గొంతులో పడేటప్పటికి రత్తాలు గొంతు మార్దవంగా మారుతుంది. హమ్మయ్య ఇక ఫర్వాలేదు. పని మానదు అనుకుంటూ సవిత రవి, వాసులను నిద్ర లేపేందుకు మళ్ళీ పక్కల దగ్గరకు వెళుతుంది. అతి కష్టం మీద రెక్క పుచ్చుకొని లేపితే గానీ వాళ్లు మంచం దిగరు.

వాళ్ళకు బ్రష్‌ల మీద పేస్టు వేయటం దగ్గర్నుంచి తనే అన్నీ చెయ్యాలి. అలా చెయ్యకపోతే వాళ్లు రాద్ధాంతం చేస్తారు. టైం ఎలాగూ అయిపోతుంది చదువుకు టాటా చెప్పి. హోంవర్కు చెయ్యరు. స్కూల్లో మాష్టారు పేరెంట్స్‌ని పిలిచి చీవాట్లు పెడతారు "ఏమండీ! భార్యా భర్త లిద్దరూ చదువుకున్నారు కదా! పిల్లలకు ఫీజు యిస్తే ఇలా చదువు అలక్ష్యం చేస్తే స్కూలు పరువు ఏంగాను" అంటూ ప్రిన్సిపాల్ మెత్త మెత్తగా చివాట్లు పెడతాడు

ప్రస్తుతం పేరొందిన కాన్వెంట్లన్నీ పిల్లల యోగ్యతను కాకుండా తల్లిదండ్రుల డిగ్రీలు చూసి సీట్లు యిస్తున్నాయి. చదువుకున్న తల్లిదండ్రులయితే యింటి దగ్గర పిల్లల చదువు పట్టించుకుంటారు. అలా ఆలోచించటం వాళ్ళ తప్పు కాకపోయినా ఇన్ని బాధ్యతలు ఓ ఆడది వహించటం ఎంత కష్టం?

స్త్రీకి విద్య ఎంతో అవసరం అని ఒళ్లుగుద్ది వాదించిన సవిత తన వాదనలో వున్న లొసుగు అనుభవంలో అర్థం చేసుకుంది.

చదువుకున్న ఆడది తన ఉరితాడు తానే ఎంపిక చేసుకుంది. ఏ చదువు రాకపోతే ఎంత హాయిగా ఉండగలిగేదో!

చదువుకున్న స్త్రీ యింట్లో పిల్లలకు పాఠాలు చెప్పాలి.... బయట ఉద్యోగం చెయ్యాలి. ఇంత చేస్తున్నా స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చిందా అంటే అదీ లేదు. తన సంపాదనపై తనకు ఎంతమాత్రం హక్కు లేదు. అన్నీ భర్త యిష్టప్రకారమే జరగాలి. అందుకు భిన్నంగా జరిగితే ఎవరి సంపాదన వారిదైనప్పుడు ఈ సంసారం ఎందుకు? ఎవరిష్టమొచ్చినట్లు వాళ్ళు ఉండామంటూ విడాకుల దాకా విషయం సాగదీస్తాడు భర్త. భర్త వదిలేసిన ఆడది ఉద్యోగం చేస్తూ పరువుగా బ్రతగ్గలదా? తన బ్రతుకు అడ్రసు లేని ఉత్తరం అయిపోతుందేమో ననే భయంతో యింక స్వాతంత్ర్యం ప్రసక్తి తీసుకురాదు. తన చదువు తనకు ఎలా ఉపయోగపడింది? మరింత బానిసను చేసింది. మరింత దోపిడీకి దోహదం చేసింది.

పూర్వం స్త్రీ ఇల్లు నాలుగు గోడల మధ్య ఏ కష్టాలు అనుభవించేదో తెలియదు గానీ స్వేచ్ఛ అనే పేరుతో బయట ప్రపంచంలో పడ్డ ఆడది మరింత నవ్వులపాల అవుతోందని సవిత నమ్మకం. స్వేచ్ఛ అనే పేరుతో బంధనాలు పెంచుకుంది. మరిన్ని బాధ్యతలను నెత్తిన వేసుకుంది. పూర్వమయితే యింటి పని చూసుకుంటే సరిపోయేది. మరి యిప్పుడో? ఇంటా బయటా చూసుకోవాలి. ఉద్యోగం చేస్తున్నది కదాని యింటి బాధ్యతలు ఏమైనా తప్పాయా అంటే అదీ లేదు

అడవాళ్ళు చదువుకోవాలి అన్నారు. చదువుకున్న ఆడది ఉద్యోగం చేస్తే పెళ్ళికి చిన్నెక్కు తోడు అన్నారు. చదువుకున్న తల్లి పిల్లలకు నాలుగు అక్షరం ముక్కలు చెప్పకపోతే ఆ చదువుకు సార్థకత ఏమిటి అన్నారు. ఉద్యోగం చేస్తున్నంత మాత్రాన యింట్లో పని చేసుకోరా ఏమిటి అంటూ ఆ పనులన్నీ యథాతథంగా అంటగట్టారు. ఇన్ని బాధ్యతలు నెత్తిన వేసుకుని స్త్రీ అనుభవించే స్వేచ్ఛ ఏమిటో సవితకు అర్థం కాదు. స్త్రీ స్వేచ్ఛ పేరుతో జరుగుతున్న కార్యక్రమాలన్నీ జారుడుబండ ప్రగతి లాంటివే. ఆమెను ఊబిలోకి మరింత దిగజారుస్తున్నాయి. పూర్వం అనుభవిస్తున్న విరామం, విశ్రాంతి కూడా ఈనాటి ఆడదానికి లేకుండా పోయింది.

తన ఆలోచనలు తనకే విచిత్రమనిపిస్తాయి సవితకు. ఉద్యోగం స్టేటస్‌గా, చదువు సభ్యతగా పరిగణించబడుతున్న ఈ రోజుల్లో తిరోగమనం ఏమిటి?

అసలు ఎందుకు వద్దనడు? పగలంతా చేయాల్సిన యింటి పని ఉదయమే చేసి ఆఫీసుకు వెళ్ళాలి. మళ్ళీ రాత్రి పని మామూలే. అలసి ఆఫీసు నుంచి రాగానే పిల్లలకు టిఫెన్ చెయ్యడం దగ్గర్నుంచి అన్ని పనులు నెత్తిన పడతాయి. కూలీ చేసే మనిషి 10 గం॥లు చేస్తుందే ఉద్యోగం చేస్తున్న ఆడది 16 గం॥లు పని చేస్తోంది. ఇదేనా స్వేచ్ఛ? ఇంత చేసినా మగవాని జులుంకు లోనుకాక తప్పటం లేదు.

ఉదయం ఆఫీసుకు వెళుతూ నిన్న తెచ్చిన ఫైళ్ళు తిరిగి తీసుకు వెళ్ళటం మర్చిపోయాడు కేశవరావు. అవి ఆ రోజే డిస్పాచ్ కావాల్సి వుంది అవటంతో ఇరవై కి మీ. స్కూటరు మీద ప్రయాణించి యింటికి వచ్చాడు.

"నిన్న ఆఫీసు ఫైల్స్ యింటికి తీసుకు రావడం చూశావుగా! ఉదయం ఒట్టి చేతులతో వెళుతుంటే ఫైల్స్ తీసుకు వెళ్ళటం మర్చిపోయారండి అని గుర్తు చేయక్కర్లేదా" అని సవిత మీద విరుచుకు పడ్డాడు.

'అమిటండీ! నేను యింటా బయటా సతమతమవుతుంటే' ఇది కూడా నా బాధ్యతే అన్నట్లు మందిపడతారేమిటి? అంటూ ఎదురు చెప్పింది. అతడు సహనం కోల్పోయాడు. మర్యాదలాడాడు. జరిగినదానికి ఆమె సారీ చెప్పమంది. ఇది వారి వివాదానికి ఓ చిన్న కారణం.

"సవితా! చిన్న విషయాన్ని ఎందుకింత సీరియస్‌గా తీసుకుంటావు? మా ఆఫీసరు చెయ్యని నేరానికి నన్ను నిందించాడు. అయినా వాడు సారీ చెప్ప లేదు. పైగా నేను చెప్పాల్సి వచ్చింది ఇది మామూలే!" అంటూ నచ్చచెప్పబోయాడు కేశవరావు

"అయితే భార్యా భర్తల సంబంధం కూడా అంతేనంటారా? యజమాని బానిస సంబంధమా? ఇద్దరిలో ఎవరి తప్పు వున్నా భార్యే క్షమాపణ చెప్పాలంటారా? అయినా మీలో తప్పు లేనప్పుడు యజమానికైనా మీరు సారీ చెప్పాల్సిన అవసరం లేదు తప్పు చేసిన వాడు ఎవరైనా సారీ చెప్పి తీరాలి అలా చెయ్యకపోతే ఆ మనిషికి సంస్కారం లేనట్టే"

ఆఫీసర్‌కు సబార్డినేట్, భర్తకు భార్య తలవంచటం ఈ వ్యవస్థలో వున్న పద్ధతి కేశవరావు వాదన. కానీ సవిత అందుకు ఒప్పుకోదు. అలా లొంగిపోవటం ఆత్మన్యూనతా భావం అంటుంది. ఆత్మాభిమానం చంపుకుని బ్రతకాల్సిన అవసరం లేదంటుంది. అక్కడ ఆఫీసర్ ముందు ఆత్మాభిమానం చంపుకుని 'సారీ' చెప్పటం యిక్కడ తప్పు చేసి భార్యకు 'సారీ' చెప్పక పోవటం రెండూ కేశవరావు చేసిన తప్పులే. వ్యవస్థలో వుందని తలవంచటం కంటే వ్యవస్థను మార్చటానికి ప్రయత్నించాలి. అప్పుడే సరైన విధానంలో వ్యవస్థ తయారవుతుంది ఇంత విడమరచి ఆలోచిస్తే గానీ కేశవరావుకు తన తప్పు అర్థం కాలేదు—

# నేరానికి శిక్ష లేదు

నువ్వు వేసిన బాంబుతో
చనిపోయేది నీ అనుచరులు కాదు
నువ్వు పన్నిన రాజకీయ చదరంగంలో
నష్టపోయేది నీ సంతతి కాదు
నువ్వు చేసిన కత్తి పరుకుతో
మోపవొయ్యేది నీ ఆస్తులు కాదు!
ప్రజాస్వామ్య పంథాన పయనిస్తూ
సమతావాద శంఖాన్ని పూరిస్తున్నవాడు
ఏ విద్రోహకుడో విసిరిన రాయికి పడిపోతాడు
ఏ హంతకుడో విసిరిన బరిసెకు బలైపోతాడు
ఏ దుండగుడో కాల్చిన కాల్పులకు గురౌతాడు
అందుకు కారణాలు కోకొల్లలు
ఒకరోజు భాషా వుద్యమం
ఒకరోజు కుల మతాల వుద్యమం
ఒకరోజు ముఠా బలాల వుద్యమం
రాక్షస ప్రవృత్తితో రక్తపాత వుద్యమాలు!
ఉద్యమ విజయాలు విగత జీవులపై
ఆధారపడి వుంటాయి
విగత జీవుల సంఖ్యను బట్టి
ఉద్యమకారులు ఉద్భవించి
గాంధీని గుర్తి చేస్తూ
అహింసను బోధిస్తూ
మార్టిన్ లూథర్ కింగ్
నెల్సన్ మండేలాలను
ఉదహరిస్తూ పుక్కిలిస్తారు!
మఖిలో పుట్టిన వుద్యమాలు మఖిలోనే గిట్టి
సముద్రాల్లోకి
శ్మశానాల్లోకి
ఎడారుల్లోకి కొట్టుకు పోతుంటాయి!
చీకట్లో జరిగిన మతలబులు
వెలుగున విచారణ కొస్తాయి.
వెలుగు చూపిన విచారణ ఫలితాలు
చీకటి పాలవడం షరా మామూలే!
నేరానికి శిక్ష లేనప్పుడు
బ్రతుక్కి గ్యారంటీ లేదు!

# క్షేమం ఉరికొయ్యకం వూగుతూంది

క్షేమం అడిగావు కాబట్టి చెప్తున్నాను
ఉరికొయ్యకు వూగుతూంది
కారణం అడిగావు కాబట్టి చెప్తున్నాను
నన్నెందుకు పలకరించావో
నాకు అర్థమైంది!

నాకు అర్థమైందని నీకు అర్థమైంది
నేను వాగ్దానాల వెలుగులో వెలిగి
వాగ్దానాల అమలును చవిచూడని వాణ్ని
నేను తప్పటడుగులు వేసినప్పుడల్లా
నువ్వు ఐదేళ్ళ పదవిని తన్నుక పోతున్నావు
సమస్యకు రూప మిచ్చేవాడు
సమస్యను రూపు మాపేవాడు
ఒక్కడే అయినప్పుడు
చెక్కిన శిల్పం చక్కని రూపు దాల్చదు!

ఆర్థికంగా ముందంజ వేశామంటున్నావు
అందుకు నిదర్శనం ఐదు పైసల నాణెం అంతర్ధానం
ప్రతి ధర రూపాయితో మొదలయ్యాక
పైసల్తో పనేముంది!
తాగే నీటి సమస్య తీరిందంటున్నావు
ఎడారిలో ఎడారి ఓడ
నల్లధనం మోసుక వెళ్తాంటే
ఒయాసిస్సులో ఒక్కొక్క లీటరు నీరు
వంద రూపాయలు అమ్ముతూంది!

.... .... .... .... .... ....

.... .... .... ... .... ....

సమస్యలన్నీ నీ ముందు ఏకరువు పెట్టాను
ఏకరువు పెట్టని సమస్యలు నాకు సృష్టించి
సమస్యల పరిష్కారానికై
నిన్ను ఆశ్రయించే దారి చూపక
సృష్టించిన సమస్యల వలయంలో
చిక్కి సతమత మౌతుంటే
ఐదేళ్ళ పదవిని దోచేసి
అంతర్ధానం అవుతుంటావు!

# చీకటింటి కథ

ఉత్తరం వెంటనే రాయాలని వుంది నాన్నా
కార్డు కొని తెచ్చుకోలేని స్థితి నాది
ఉత్తరం రాయనివ్వని సాంఘిక స్వేచ్ఛ నాది
నీరుండదు
నిప్పుండదు
సావిత్రినై
నక్కుబాయినై
బియ్యాన్ని వుడక బెట్టాలి
ఆఫీసు వేళకు నిద్ర లేచిన నా భర్త
అర్ధరాత్రి ఇంటికి చేర్తాడు
తాగని వాళ్ళతో తగు వేసుకోవడం
తాగిన వాడికి సరదా
తాగిన వాడి చెంపదెబ్బ
తాగని వాడి దెబ్బ కంటే రెండు రెట్లు అధికం
మత్తులో వున్న నా భర్తకు
ఆకలి వుండదని నాకు తెలుసు
ఆకలి నన్ను దహిస్తుందని ఎవరికి తెలుసు?
ఆకలి మరిచి చుట్టూ నిద్రపోతున్న
అన్ని ఇళ్ళకూ తెలుసు!
నాన్నా నువు ఏడవకు
నువు ఏడ్చి ఏడ్చి
నీ గుండె ఆగితే
మా గుండెలు ఆగుతాయి
ఇక్కడ ఇల్లాళ్ళందరూ
ఒకటో తేదీ కోసం ఒకటే ఎదురు చూపు
నాకు అన్ని తేదీలూ ముప్పయ్యో తేదీలే!

నా ఏడుపును మాన్పించే మందు నీ దగ్గర లేదు
ఏ వైద్యుడి దగ్గరా లేదు
అది నేనే తయారు చేసుకోవాలి
నాలాంటి వాళ్ళకు పంచిపెట్టాలి!

# ఆమె చూపు నీరౌతుంది

అర్ధరాత్రి పోలీసులు వీధి వెలుగుపై లాఠీచార్జి చేసి
చీకట్ని దింపి
ఇంటిని ముట్టడించి
అమానుష క్రియలతో అదృశ్యం చేసిన తన బిడ్డ జాడను
ఏ అదృశ్య హస్తమో
దృశ్య హస్తమో
అశరీర వాణో
వేళగాని వేళలో
అపరాత్రి వేళలో
మోసుకొస్తుందని
ఆమె ఇంటి ముందు కూర్చొని చూస్తూనే వుంటుంది
అప్పుడప్పుడూ చూపు నీరౌతూ వుంటుంది!

బడికి హారం వేసి తల్లి చేతుల్లోంచి
పాదరసంలా జారిపోయే పిల్లాడ్ని;
గోధూళి వేళ గంగడోలు చిరు మువ్వల్ని
మోగించుకొంటూ పాలు కుడిసే లేదూడల్ని;

మసక చీకట్లో గూటికి చేరి
రెక్కలు రాని బిడ్డల్ని రెక్కల్లో దాచుకొనే పక్షుల్ని
ఆమె చూస్తూనే వుంటుంది
అప్పుడప్పుడూ ఆమె చూపు నీరౌతూ వుంటుంది!

బస్సు రైళ్ళ చప్పుళ్ళు
ఆమె ఆశకు చిగురులు తొడుగుతుంటాయి
కదిలిన ఆకూ
క[illegible]లించిన గాలీ
కబురును అడిగి
పిలవని పిలుపు వెంట పిలుపుకు అందనంత దూరం
ఆమె వెళ్ళిపోతూ వుంటుంది!

ఉదయాన పోస్టుమేన్ ఆశల పల్లకి మోసుకొచ్చి
ఇంటింటా ఆపి
తన ఇంటి ముందు ఆగకుండా సాగడం
ఆమె చూస్తూనే వుంటుంది
అప్పుడప్పుడూ చూపు నీరౌతూ వుంటుంది!

శ్రీ ఆడిగోపుల వెంకటరత్నమ్

**శ్రీ వేదాంతం రాజగోపాల చక్రవర్తి**

# భారతదేశ చరిత్ర - రథముల వైశిష్ట్యము

**ఉపోద్ఘాతం :**

"సప్తాశ్వ రథ మారూఢం ప్రచండం కశ్యపాత్మజం
శ్వేత పద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్"

-అంటూ భారతదేశ ప్రజలు రథారూఢుడై లోక సంచారానికి బయలుదేరిన ఆ సూర్య భగవానుడిని అరుణోదయంలో ప్రార్థిస్తారు. ఇలా ప్రజలకు తెల్సిన ఆ సూర్య రథం గూర్చి ఎన్నో విషయా లున్నాయి. ఇంతేకాక అసలు రథం అంటే ఏమిటి? దాని స్వరూప స్వభావాలు ఏ విధంగా ఉంటాయి? అన్న ప్రశ్నలకు సమాధానాలు మన వాఙ్మయంలో ఉన్నాయి. ప్రాచీన కాలంలోనే కాక ఆధునిక కాలంలో కూడ రథ ప్రసక్తి ఏదో రకంగా సాహిత్యంలో చోటు చేసుకుంటూనే ఉన్నది.

శ్రీశ్రీ మహాప్రస్థానంలో "జగన్నాథుని రథచక్రాలు" అనే శీర్షికలో అట్టడుగు ప్రజల ఆవేదనను పై శీర్షిక ద్వారా సింబాలిజం దృష్టిలో రచించాడు. విశ్వనాథ తన ఆంధ్ర ప్రశస్తిలో "వేంగీక్షేత్రము" అనే ఖండికలో "చిత్రరథస్వామి శ్రీరథోత్సవములం దెలుగు పిల్లలు కత్తి త్రిప్పరేపుడో" అని తెలుగువాళ్ళ పౌరుషాన్ని ఆ రథ పండగలో రంగరించాడు. రథం అనేది భౌతికంగా నేటి ప్రజల వాహనంగా లేకపోయినా సంస్కృతిలో నిల్చిపోయినది. దానియొక్క పుట్టు పూర్వోత్తరములు, వైభవ క్షీణ దశలు సామాన్య పాఠకులకు అందించటమే ఈ వ్యాసోద్దేశ్యము—

రథాల ప్రస్తావనలు భారత వాఙ్మయం నిండా ఉన్నాయి. వేదాలు, స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు, సాహిత్యం ఈ విధంగా అనంతోన్ముఖంగా రథ విషయాలు దర్శనీయమవుతాయి. భారతీయ భాష లన్నిటిలోను ఈ రథ సంబంధ చర్చలు చోటు చేసుకునే ఉన్నాయి. మనకి లభ్యం అవుతున్న వాఙ్మయాన్ని ఆధారం చేసుకుని ఈ రథ చరిత్రను తెల్సుకోవచ్చు.

**వేద వాఙ్మయం :**

ప్రపంచంలో తొలి వాఙ్మయమైన ఋగ్వేదంలో రథం గూర్చి చక్కని విషయాలున్నాయి. అపూర్వ కల్పనలకు ఆలవాలమై కొన్ని వాస్తవ విషయాలకు సాక్ష్యమై మరికొన్ని ఆధ్యాత్మిక భావనలకు ప్రతీకయై ఈ రథం నిల్చింది. వివాహ సమయంలో రథారోహణ చేయటం మనకి ఋగ్వేదం నుంచి కన్పడుతుంది

"పూషాత్వేతో నయతు హస్త గృహ్యాశ్వి
నాత్వా ప్రవహతాం రథేన
గృహాన్గచ్ఛ గృహ పత్నీ యథా సోవశీ
నీత్వం వదథ మావదాసి" (10-85-26)

'పూష చేయి పట్టుకొని నిన్నిచట నుండి (పితృ గృహము నుండి) మరొక దేశమును (భర్త గృహమును) పొందించు గాక! అశ్వినులు నిన్ను రథం చేత వెళ్ళింతురు గాక!" అని ఈ ఋక్కు అభిభాషణ. పెళ్ళి అయిన పిమ్మట కింశుకశాల్మలీదారువులతో కూడిన రథంపై వధువును కూర్చుండబెట్టి రథానికి చక్కని గుర్రాలను కట్టి భర్త గృహానికి నవ వధువును తీసుకు వెళ్ళేవారు—

'ఏషాగోభి రరుణే భిర్యుజానా', 'వితద్యయురుణ యుగ్భి రశ్వైః' వంటి కొన్ని ఋక్కుల వల్ల రథాలకు ఎర్రని ఎద్దులను, అరుణ వర్ణ గుర్రాలను కట్టేవారు. ఇంద్రుని రథానికి 10,000 గుర్రాలున్నట్లు ఒకచోట ఉన్నది (6-47-18) ఈ రథం మీద భక్తులందరికీ ఒకేసారి ప్రత్యక్షమౌతూ ఉంటాడు ఇంద్రుడు.

సూర్యుని రథం గూర్చి ఒక ఋక్కు ఇలా చెపుతుంది.

సప్తయుంజన్తి రథమేక చక్రం
ఏకో అశ్వోవహతి సప్తనామా
త్రినాభి చక్రమ జరమనర్వం
యత్రేమా విశ్వాభువనాధితస్థుః (1-164-2)

సూర్యుని రథం ఒక చక్రం మాత్రమే కలది. ఈ రథం శిథిలం కాదు. పీగిపోదు దీనియందే సమస్త భువనాలు ఆధారపడి యున్నవని దీని సారాంశం. "యం కుమార నవం రథమ చక్రం మనసా కృణోః" (5-90-3) అను మంత్రం వలన చక్రం లేని రథం కన్పడుతుంది. ఒకచోట త్రిచక్ర రథం కూడా ఉన్నట్లు తెలుస్తుంది.

ఋగ్వేదం చెప్పే విషయాలను చారిత్రకాత్మకంగా పరిశీలిస్తే ఆర్యులు 4 చక్రాలు ఉన్న రథాలపై అమిత వేగంగా వచ్చి ఇక్కడున్న దస్యులను ఓడించేవారు. దస్యులకు రథ బలగం లేనట్లు తోస్తుంది. ఆర్యుల దండయాత్రలను విరోధించలేని విధంగా వీరి జనవాసాలు ఉండేవి. ఇంద్రుడికి పురందరుడని పేరు. అనగా పురములు కూల్చేవాడని అర్థం. ఆర్యులు దండయాత్రల సందర్భంలో ఇంద్ర స్తుతి చేసేవారు. రథారూఢుడై ఇంద్రుడు నగర నాశనానికి తోడ్పాటుగా ఉండాలని వీరి ఆకాంక్ష. ఈ ఇంద్రుడు రథాన్ని ఎక్కి శత్రు పురములవైపు సాగుతాడు. ఆర్యుల రథ యుద్ధ పద్ధతి గూర్చి ప్రముఖ చరిత్రకారుడు యన్. జి. సర్దేశాయ్ తన గ్రంథంలో ఇలా అంటాడు. "ఆనాడు యుద్ధాల్లో వారు ఉపయోగించిన రథం ఆధునిక టాంక్ లాంటిది." ఋగ్వేద కాలంనాటి సంస్కృతిలో రథాల పందెములు ఒక వేడుకగా ఉండేవి.

ఋగ్వేద కాలంకన్నా ముందర ఇక్కడ రథాలు ఉన్నట్లుగా తెలియుట లేదు. ఒకవేళ ఉన్నాయని అనుకున్నా ఆ ఊహకి స్పష్టమైన ఆధారాలు లేవు. అతి ప్రాచీనమైన 'హరప్పా-మొహంజదారో' శిథిల పట్టణాలలో రథ సంబంధ ఆధారాలు దొరకలేదు. ఇండియాలో ప్రస్తుతం లభిస్తున్న లిఖిత ప్రతులలో కల్లా ప్రాచీనమైన ప్రథమము అయినా ఋగ్వేదంలోనే ఈ రథ సంగతులు పేర్కొనబడ్డాయి కనుక ఋగ్వేదంలోని రథ విషయాలు మొదటగా ఉటంకించాలి. పైగా గురు పరంపరగా అధ్యయనం చేయబడుతున్న వేదాలలో మొదటిది ఋగ్వేదం అగుటచేత ఋగ్వేదం కన్నా పూర్వం రథం అంతగా వ్యాప్తి చెందలేదని తెలుసుకోవచ్చు. ఈ కాలం నాటికి (ఋగ్వేద) రథం యుద్ధం మొ॥వాటియందు ప్రముఖ స్థానం వహించుటచేత తర్వాత కాలంలో ఈ రథం ఋషుల యొక్క వాక్కులయందు ఆధ్యాత్మిక పవిత్రతను పొంది పలుమార్లు ఋక్కుల యందు పరిభ్రమించింది.

యజుర్వేద సామవేద అధర్వణ వేదాలలో ఉపనిషత్తులలో ఈ రథ ప్రస్తావనలు లేకపోలేదు. కొన్ని యజ్ఞాలలో ఋత్విక్కులకు రథా లిమ్మని వేదాలలో ఉన్నది. గానం ప్రాధాన్యంగా కల్గిన సామవేదంలో రథ ప్రస్తుతి కన్పడుతుంది. అధర్వణ వేదం అనే ఉప వేదాలకు పుట్టినిల్లు. ఇందులో కూడా రథాల సంగతులు తెల్పబడ్డాయి. ఈ విధంగా వేద వాఙ్మయంలో రథముల గూర్చి స్పష్టమైన సమాచారం ఉంది.

స్మృతి వాఙ్మయం :

స్మృతులలో ఇతర ధర్మ గృహ సూత్రాలలో ప్రజల జీవన విధానంలో నాడు రథం యొక్క ప్రస్తావన ఎక్కడెక్కడుందో తెలియవస్తుంది. దరిదాపుల అన్ని స్మృతులు సూత్రాలు వివాహ సందర్భంగా రథారోహణ చేయాలని చెప్పబడింది. అంటే ఈ ఆచారం ఆనాడు సమాజంలో ప్రముఖంగా ఉండేదన్నమాట. లౌగాక్షి, వారాహి, గోభిల మొ॥గు గృహ్య సూత్రాలలో రథాల గూర్చి ఈ విధంగా చెప్పబడింది. అత్తవారింటికి వెళ్ళేముందు రథాన్ని ముందుగా తూర్పుగా పోనిచ్చి తర్వాత వాళ్ళు వెళ్ళే దిశలు పోవాలి. నూతనంగా రథారోహణ చేసేటప్పుడు "వనస్పతే వీడ్వంగ" వంటి పలు మంత్రాలతో హోమం చేసి అప్పుడు ఎక్కవలెను. పెళ్ళి అయిన పిమ్మట భర్త ఇంటికి వెళ్ళుచున్నప్పుడు రథ చక్రాదులు విరిగితే గృహ్యాగ్నిని ప్రజ్వలింపచేసి, వామదేవ్య గానం చేసి రథాధికమును అధిష్ఠించి వెడలవలెను. నేటి వివాహములలో కార్లు జీపులలో ఎక్కి వీధులలో లేక ఇళ్ళకు వెళ్ళటం ఎటువంటిదో పూర్వం రథాల మీద వెళ్ళటం అటువంటిది.

రథ ప్రయాణంలో చక్రాలు ఏమన్నా విరిగితే దానిని అశుభంగా పరిగణించి శుభ క్రియలు జరిపేవారు. నాటి కాలంలో రథాన్ని ఒక ఉన్నత సౌకర్యవంతమైన ప్రయాణ సాధనంగా ( ) చూపేవారు. 1130 సం॥ పశ్చిమ చాళుక్య రాజైన సోమేశ్వర ుపుడు తన అభిలషితార్థ చింతామణిలో వివాహం 4 రోజులు చేయాలని, నాల్గవ రోజు రాత్రిన వధూవరులను రథాలపై (లేక ఏనుగులపై) ఉంచి ఊరేగింపు చేయవలెనని చెప్పాడు.

గౌతమ ధర్మసూత్రంలో "చర్యా చ రథ ధనుర్భ్యామ్" అనే సూత్ర వ్యాఖ్యానంలో రాజు పట్టణమందు కాని, వెలుపలి రాష్ట్రములందు కాని సంచరించు నపుడు రథమును ఎక్కవలెను. చేతియందు ధనస్సు ధరించవలెను. అని నిర్దేశింపబడినది.

ఆగమ వాఙ్మయం :

వేద ధర్మాన్ని అనుసరిస్తూ పరమాత్మను అర్చనావతారము రూపమున సేవిస్తూ మోక్ష మార్గము పై పునకు మళ్ళించునవి ఆగమ శాస్త్రములు. వీటికి పట్టుగొమ్మలు ఆలయములు. అతి ప్రాచీనమైన వైఖాన సాగమమునందు ఈ రథ సంబంధ ఉత్సవాదులు చెప్పబడ్డాయి. సంకీర్ణ ప్రకరణమందు ఏకవింశతి దివోత్సవముల

# “ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?”

“పోయిందే!”




మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునుపటికంటే అతి త్వరితంగా వుపశమింపజేయగలదు!

## మేలుపరచబడిన

# అమృతాంజన్

Amrutanjan Limited 

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా తిరిగి వికసింపచేయగలదు!

చివర రోజున ఉదయం రథయాత్ర చేయమని ఉంది. రథం దగ్గరే రథాంగ హోమం చేస్తారు. "ఓం రథి న్తరమసి వామ దేవ్యమసి బృహదసి" అను మంత్రం చేత స్వామిని రథంలో ఉంచాలి. పిమ్మట సర్వ వాద్యములతో గ్రామమందు రథాన్ని ప్రదక్షిణం చేయించాలి. రథోత్సవ సమయంలో ప్రమాదవశాత్తూ మనుష్యులు ఎవరన్నా పడి మరణి స్తే దానికి ప్రాయశ్చిత్త విధులు చెప్ప బడ్డాయి. రథ చక్రం విరిగిపోతే అంటే స్వామిని ఉంచి పూజలు జరపాలి. తర్వాత దానిని బాగుపర్చాలి. "రథచక్రం తదాధారం మదృఢీ కృత్య పూర్వవత్" అని ఆగమం చెపుతుంది.

పాంచరాత్ర, శైవాగమాల యందు కూడా ఈ రథాల గూర్చి సముచితంగా సమాచారం లభి స్తుంది. శ్రీ కారణాగమ మున కూడ రథాన్ని గూర్చి కొంత విషయం తెలు స్తుంది. 'రథ సంగ్రహణ విధి పటలం' అనే ప్రకరణంలో-

అతః పరం ప్రవక్ష్యామి రథ సంగ్రహణాం పరం।
సర్వపాప హరం పుణ్యం సర్వదుఃఖ నివారణం॥

అని ప్రారంభిస్తూ రథోత్సవం ముందర రథాంగా లన్నిటిని సరి దిద్దవలెను. రథ వివిధ భాగాలలో ఉన్న అధిష్ఠాన దేవతలను కీర్తించాలి. రథాన్ని రథ మార్గాన్ని అందంగా మనోహరంగా చేయాలి. లోక రక్షణార్థం పరమేశ్వరుడిని రథం మధ్యలో ఉంచవలెను. తర్వాత ఉపచారాలు గావించి ఉత్సవం మొదలు పెట్టాలి. ఈ సందర్భంలో ఆచార్యులను యథోచితంగా సత్క రించాలని చెపుతూ రథసేవ చే స్తే సర్వ పాపాలు పోతాయని వక్కాణిస్తూ చివరగా ఇలా చెపుతుంది ఈ ఆగమం.—

గ్రామాదిషు విశేషేణ రథయాత్రాం శివస్యతు।
ఇహ భోగ సవాప్నోతి తత్ప్రసాదా చ్ఛివస్యతు॥

నిఃమే! నాటి శాస్త్రిలు ప్రజలు ప్రతి పనిలోను పరమాత్మను భావించి సంభావించారు. ఆ ఆగమంగా శాస్త్ర నిర్దుష్టతను పొందింది.

ఇక ఉపనిషత్తుల విషయానికి వ స్తే మనకున్న శతాధిక ఉపనిషత్తులలో కొన్ని మాత్రమే రథ విషయాలను తెల్పు తాయి. రైక్వుడనే ముని ఎల్లప్పుడు రథంతో కూడినవాడై ఉంటాడు. జ్ఞానశ్రుతి అనే రాజు బ్రహ్మవిద్యా గ్రహణా నై గృహస్థ ఆశ్రమ స్వీకారం చేద్దామన్న కోరికతో ఉన్న రైక్వుడికి వేయి గోవులను, కంఠాభరణములను "తస్మాద్గర్దభో ద్విరేతాః" అని శ్రుతి యందు చెప్పబడి ద్విరేతస్కములుగా ప్రసిద్ధి పొందిన, ఎక్కువ భారము మోయుటకై సమర్థములైన గర్దభములతో కూడిన రథమును మరియు తన కుమార్తెను ఇచ్చి తద్విద్య పొందెను.

పేరాకదోట 'అశ్వతరీ రథః' అని చెప్పబడినది. అశ్వతరీ సంజ్ఞతో ప్రసిద్ధమై ఉన్న ఉత్తమ గర్దభాలతో కూడిన రథం పేర్కొనబడినది. ఇలా అక్కడక్కడ ఉపనిషత్తులలో రథ ప్రస్తావనలు కలవు.

రామాయణం :

రామాయణ మందు రథ వర్ణనలు హృద్యముగా ఉంటాయి. దీర్ఘ ప్రయాణాలకు, నగర విహారాలకు, ఇతర కార్యకలాపాలను రథాలను విస్తృతంగా ఉపయోగించుకున్నారు. శ్రీరాముని తండ్రి పేరు దశరథుడు. అంటే పది దిక్కులయందు రథమును పోనివ్వు వాడని అర్థం. శ్రీరాముడిని పట్టాభిషేకానికి తోడ్కొని రమ్మని దశరథుడు పంపితే సుమంత్రుడు వరూధినీ (పై కప్పు ఉన్న) అనే రథం ఎక్కి రామ మందిరానికి వచ్చాడు. శ్రీరాముడి తండ్రి వద్దకు ఇలా బయలుదేరాడు. బంగారు పూత పూసి మణులు తాపడము చేసిన వెండి రథానికి ఏనుగు పిల్లల్లాంటి గుర్రాలను కట్టారు. అందులో పులి తోలు పరిచారు. కౌసల్యా తనయుడు అందు ఆసీనుడయ్యాడు. లక్ష్మణుడు అన్నకు ఎండ తగలకుండా ఒక చేతిలో ఛత్రము, రెండవ చేతితో చామరము వీయుచుండగా, పురజనులు కనులార చూచుకొనుటకై నెమ్మదిగా రథం మీద బయలుదేరినాడు.

రాముడు వనవాసమునకు వెళ్ళిన తర్వాత భరతుడికి కబురు అందుతుంది. అతడు గంగాతీరము దాటి అయోధ్యకు చేరుకొనే టంతవరకు రథం మీదనే ప్రయాణం చేసాడు. చిత్రకూటము నందున్న రామ దర్శనార్థమై సైన్య సహితుడై అన్న ఆశ్రమానికి దూరంగా ఆగుతాడు. ఏనుగులను, రథ పతాకములను చూచి దండయాత్రకు భరతుడు వచ్చినాడని ఊహించి లక్ష్మణుడు యుద్ధసన్నద్ధు డవుతాడు.

ఇక రామ రావణ సంగ్రామం అతి భీకరంగా సాగుతుంది. అంతకుముందు రాక్షసులు చిత్ర విచిత్రమైన రథాలను అధిరో హించి గాడిదలు, గుర్రాలు కట్టి ఉన్న తమ రథాలపై వానర సైన్యం విరుచుకు పడుతుంటే రథాల నుంచి కిందకి దూకి కూడ యుద్ధం చేస్తారు. వానరులలో ప్రసిద్ధ వీరులు కొండలతో వృక్ష లతో రాక్షస వీరుల రథాలను ముగ్గు చేయటం, సారథులను చంపటం రథికులను వధించటం చేస్తుండేవారు. రాముడికి మాతలి

వచ్చి ఇంద్ర రథంపై యుద్ధం చేయమని కోరుతాడు— ఇంద్రజిత్తుని రథం ఆకాశ గమనం కలది.

వీటన్నిటికి పూర్వం సీతారాముల కల్యాణ సమయంలో జనకుడు తన అల్లుడికి అనేక కానుకలతో పాటు రథాలు కూడ ఇచ్చి మర్యాద చేస్తాడు. అనేక విధాలుగా అనేక సందర్భాలలో రథాల అవసరాలు, వాటి గూర్చి ప్రస్తావనలు మనకు రామాయణంలో కన్పిస్తాయి.

**మహాభారతం :**

మహాభారతంలో రథ ప్రస్తావన లేకుండగా పర్వాలు నడిచేవి కావు. అంత ఇదిగా జీవన వ్యవహారంలో ముఖ్యంగా రాజులకు ఇవి అవసరమయ్యాయి. ఈ కాలం నాటికే రథాలను ఎక్కువగా యుద్ధరంగంలో ఉపయోగించేవారు. అశ్విక సైన్యాన్ని సంగ్రామంలో ఉపయోగిస్తున్న రథాలకున్న ప్రాముఖ్యం వీటికి ఉండేది కాదు. రథాలను వివిధ గతులలో నడిపే విద్య ఈ కాలంలో చాలా అభివృద్ధి చెందింది. మహాభారత యుద్ధంలో 60 వేల రథాలతో 2000 వేల కళింగులు కౌరవుల పక్షాన చేరారు. (గంగానదికి దక్షిణ భాగంలోని ఖరగ్‌పూర్ వాసులు) చతురంగ బలాలలో రథాలే జయాపజయాలు నిర్ణయించేవి.

ఇంకా అనేక రథ సంఘటనలు భారతంలో ఆకర్షణీయంగా కన్పిస్తున్నాయి. జరాసంధుడి వధానంతరం అతని దగ్గరున్న దివ్య రథాన్ని కృష్ణుడు స్వాధీనం చేసుకుంటాడు. ఈ రథం మీదనే ఇంద్రుడు వృత్రాసురుడిని వధించాడు. అంబ విషయమై పరశురామ భీష్ముల మధ్య యుద్ధం ఏర్పడుతుంది. సర్వసన్నాహ సమేతమైన రథం ఎక్కి భీష్ముడు, దివ్యములైన రథరక్ష్యములు శస్త్రాస్త్రము కల్గి అకృత వ్రణుడను సారథిని చేసుకుని పరశురాముడు యుద్ధం చేస్తారు.

కృష్ణుడిని సారథిగా చేసుకుని అర్జునుడు అగ్ని ఇచ్చిన రథం మీద ఇంద్రుడిని ఎదుర్కొని ఖాండవ దహనం అగ్నిచేత నిర్విఘ్నంగా కొనసాగిస్తాడు. సుభద్ర పరిణయ విషయంలో కృష్ణుడు చెప్పగా వచ్చిన దారుకుడిని సారథిగా చేసుకొని రథం మీద సుభద్రను అర్జునుడు తీసుకు వెళ్ళిపోతాడు. ద్రౌపదీ వివాహ మహోత్సవంలో ద్రుపదుడు పాండవులకు వేరు వేరుగా అనేక ఆభరణములతోపాటు వేయి కాంచన రథాలు కానుకగా ఇస్తాడు.

మహాభారత యుద్ధంలో మొత్తం 3,93,660 రథాలు వాడబడ్డాయి. మరే యుద్ధంలోను ఇంత విస్తృతంగా రథాల మోహరింపు కనపడదు. "అంబరము రథ ఘోష భీషాభి రామ కింకిణీ గణ ఝణ ఝణ త్కృతిమయముగా" పాండవ రథ బలగం నడుస్తుంది. అభిమన్యుడి దుర్మరణానికి శోకిస్తున్న అర్జునుడిని చూచి కృష్ణుడు ఆవేశ పూరితుడై తన సారథి అయిన దారుకుడితో నీవు నీ రథాన్ని తీసుకుని గుర్రాలను పూన్చి కనక మణి మాలికాకృతం చేసి "గరుడ ధ్వజంబు సంఘటించి చక్ర గదా శార్ఙ్గ ప్రముఖాస్త్ర శస్త్రంబులు దగు తెఱంగున నునిచికొని హైమయుపు దొడిగి రమ్ము" అని పల్కుతాడు. కృష్ణుని రణావేశమును దారుకుడు తన శాంత వచనాలతో విరమింప చేస్తాడు. ద్రోణుని రథం భూమికి తగలకుండా రణంలో సంచరిస్తుంది. అశ్వత్థామ చచ్చాడన్న వార్త వినగానే ద్రోణుడు విశ్చేష్టుడవుతాడు. అప్పుడు—

నేలకు నల్గెడు బొదవున
గ్రాలుచు మును మె ఆయు గురుని రథచక్రముల
క్కాలంబున న మరణయ
శ్రీ లోపము దెలియ నంటసి లబడి యె నృపా!

అని సంజయుడు ధృతరాష్ట్రునికి చెపుతాడు.

యుద్ధంలో ఒకళ్ళ రథాలను ఒకళ్ళు నాశనం చేసుకోవటం, రథం లేనివాళ్ళు గజాలను వేరొక యోధుని రథం ఎక్కటం సామాన్యంగా కన్పిస్తుంది. రథి సారథిని చంపటం, రథా గుర్రాలను హింసించటం, రథ చక్రాలను కూల్చటం, రథ ధ్వజాలను తుంచటం వంటి వీరోచిత కార్యాలు యుద్ధంలో కన్పడుతుంది. ఈ విధంగా భారత రచనలో మనకి రథం గూర్చి ప్రస్తావనలు, విశేషాలు తెలుస్తున్నాయి.

**బౌద్ధ వాఙ్మయం :**

బుద్ధుని కాలం నాటికి (క్రీ.పూ. 623-543) రథాల వాడకం యథా ప్రకారంగా సాగుచునే ఉన్నది. బ్రాహ్మణులతో సహా ఇతర వర్ణాలవారు కూడ రథాల మీద తిరిగేవారు. బుద్ధ దర్శనార్థమై వచ్చే చక్రవర్తులు, శ్రీమంతులు, బ్రాహ్మణులు, వర్తక సంఘ ప్రముఖులు దూరంగా తమ రథాలను ఇతర వాహనాలను నిలిపి ఆయన దగ్గరకు వచ్చేవారు. గౌతముడికి ఈ వాహనాల ఆర్భాటం కోలాహలం ఇష్టం లేదు. ఆయన నిశ్శబ్ద ప్రియుడు. తథాగతుని వైరాగ్య ఉద్దీపనకు ఆయన పట్టణంలోకి రథం మీద వస్తూ ముసలివాడిని, రోగిని, శవాన్ని, సన్యాసిని చూసి కదా! మహాభినిష్క్రమణం చేసింది. నాటి రాజులందరూ విధిగా రథం మీదనే

వర్ణించేవారు. సౌఖ్యవంతము, వేగవంతము అయిన వాహనము అప్పుడు రథం ఒక్కటే.

జాతక కథలయందు ఇతర బౌద్ధ వాఙ్మయమందు రథ ప్రస్తావనలు కలవు. ఒక జాతక కథలో రాజు మరణిస్తే క్రొత్త రాజును ఎన్నుకోవటం కోసం పద్మరాగ సైంధవములను పూన్చిన పుష్పరథంపై పంచరాజ చిహ్నములుంచి రథికుడు లేకుండగా పట్టణంలోకి వదిలేవారు. ఇంకో రథంపై భేరీలు వాయించే గణం ఉండేది. ఆ రథాన్ని ఎవరు ఎక్కితే వారు రాజు.

కురుధమ్మ జాతకంలో ఉపరాజును సేవించుటకై రథం ఎక్కి ప్రాసాదం ముంగిట చేరుకుని అక్కడినుంచి నడచి లోపలికి వెళ్ళారు. ఈ రథం బౌద్ధుల ఆధ్యాత్మిక భావనలో కూడా ప్రవేశించినది. "కమ్మవిబంధనాసత్తా రథస్సాణీ వయాయతో" (రథం చక్రం యొక్క ఇరుసుల వలె జీవులు కర్మబద్ధులై పరిభ్రమిస్తూ ఉంటారు) అని దీని సారాంశం.

మిళింద పన్హ గ్రంథంలో నాగసేనుడికి, మిళింద మహారాజుకు మధ్య ఆధ్యాత్మిక సంభాషణ రథ స్వరూప విస్తారణతో ప్రారంభమౌటం గమనార్హం.

సారధులు :

సారధి అంటే రథాన్ని తోలేవాడని అర్థం. సారథి లేకుండే రథికుడు సంగ్రామంలో నిలిచి పోరాడటం కష్టం. రథం మీద నుంచి పోరాడే ప్రథమ దశలో రథికుడే సారధ్యం వహించేవాడు. తర్వాత కాలంలో రథ విద్య అభివృద్ధి పొందటంతో ప్రత్యేకంగా సారథులు ఏర్పడ్డారు. ఈ సారధులు ఎవరు? వీరు పుట్టుక ఎలా తెల్సుకోవటం? వంటి ప్రశ్నలకు మనుస్మృతి సమాధానం చెపుతుంది. ఇందు ప్రతిలోమ జాతుల గూర్చి చెప్తూ మనువు ఈ విధంగా చెపుతాడు. "క్షత్రియా ద్విప్రకన్యాయాం సూతో భవతి జాతితః" క్షత్రియుడికి బ్రాహ్మణ స్త్రీకి జన్మించినవాడు సూతుడు. ఈ సూతులు చేసే వృత్తిని గూర్చి చెప్తూ "సూతా నామశ్వ సారధ్యమ్" రథ సారధ్యము వీరియొక్క పని అని చెప్పబడినది. కర్ణుడిని పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులు సూతులు. తల్లి రాధ తండ్రి అధి(ది)రథుడు

"నియంతా ప్రాజితాయంతా సూతః క్షత్తాచ సారథిః
సవ్యేష్ఠ దక్షిణ స్థాచ సంజ్ఞా రథ కుటుంబినః"

అని అమరకోశ ఉద్ఘాటన. సారథి చేసే పనులకు అనుగుణంగా అనేక పేర్లు ఏర్పడ్డాయి. ఈ సంగతినే పై శ్లోకం చెపుతుంది. నియంతా అంటే అశ్వములను నియమించువాడు. ప్రాజితాయంతా అంటే గుర్రాలను ప్రేరేపించేవాడు. సూతః అంటే గుర్రాలను బోధిచ్చేవాడు. క్షత్తః అంటే గుర్రాలను కొట్టేవాడు. సారథి అంటే గుర్రాలను తోలేవాడు. సవ్యేష్ఠ అంటే గుర్రాలను తోలేటప్పుడు ఎడమవైపు కొంచెంసేపు కూర్చునేవాడు. దక్షిణసౌచ అంటే కుడి దిక్కున కొంచెంసేపు కూర్చునేవాడని అర్థం. పై సంజ్ఞల అనుక్రమణలో రథగమన లక్షణం గోచరిస్తుంది.

స్త్రీలు కూడ రథ సారధ్యం నెరిపేవారని ఋగ్వేదం ఉద్ఘోషిస్తుంది. ఒక ఋక్కులో ఏతద్విషయం ఇలా ఉంది.

"ఉత్స్మవాతో వహతి వాసో అస్యా అధి రథం యద
జయత్స హస్రమ్
రథీర భూన్ముద్గలానీ గవిష్ఠౌ భరేకృతం వ్యచేంద్రి సేనా"

దీని భావం ఏమిటంటే ముద్గలుని భార్యయైన ఇంద్రసేన అతని రథానికి సారథి. ఆమె వస్త్రం గాలిలో ఎగురుతుంది. ఆమె ఎప్పుడైతే గొప్ప రథాన్నెక్కి సహస్ర సంఖ్యాకములైన పశులను జయించిందో అప్పుడామె వస్త్రం ఎగిరింది. హరింపబడిన పశులను తీసుకు వెళ్ళుటయందు ఆమె సారథి అయ్యింది. ఇటువంటి సాక్ష్యాలు కొన్నిచోట్ల కన్పడుతుంటాయి.

ఇక కొంతమంది సారథుల గూర్చి తెల్సుకుందాం. ఇంద్ర రథాన్ని తోలే "మాతలి" అనుభవం గడించిన మహా సారథి. అనేక దేవ దానవ యుద్ధాల్లో పాల్గొన్నాడు. రామ రావణ యుద్ధంలో రాముడికి కూడ సారథిగా ఉండి భేష్ అనిపించుకున్నాడు. రామాయణంలో దశరథుడు ఒక యుద్ధంలో పోరాడుతూ ఉండే అతని భార్య కైకేయి సారధ్యం వహించినట్లు విరిగిపోయిన చక్ర ఇరుసు స్థానంలో తన వేలుని ఉంచి, పోరాడుతూ భర్త విజయానికి తోడ్పడినదని కథనం. దశరథుడి మంత్రియైన సుమంత్రుడు అత్యవసర రాచకార్యాలప్పుడు తానే సారధ్యం వహించేవాడు. శ్రీరాముని వనవాస సందర్భంలో అయోధ్య నుంచి గంగా తీరం వరకు తనే రథానికి సారథియై అక్కడ సీతా లక్ష్మణ రాములను దిగబెడతాడు.

ద్వాపరయుగ కాలంలో మాతలిని సారథిగా చేసుకుని ఇంద్ర రథం ఎక్కి అర్జునుడు నివాత కవచులను దైత్యులను నిర్జిస్తాడు. భారతంలో శ్రీకృష్ణుడు, శల్యుడు గొప్ప సారధులుగా

ప్రశస్తి కెక్కారు. కృష్ణ భగవానుడు పార్థసారథి అయిన అతనికి కూడ ఒక సారథి ఉన్నాడు. అతడే దారకుడు. అర్జును డంతటి రథికుడు కూడ ఒకసారి సారథి అవ్వవలసిన పరిస్థితి ఏర్పడినది. ఉత్తర గోగ్రహణ ఘట్టంలో ఉత్తర కుమారుడికి సారథియై రథ చోదనం చేస్తాడు. శంతనుడు సత్యవతిపై మనసుకొని, దాశరాజు చెప్పిన షరతుకు లోబడక వేదన అనుభవిస్తూ ఉంటాడు. తండ్రి వేదనకు కారణం తెలియక భీష్ముడు చివరకు తండ్రి రథసారథిని మర్యాదగా సంభావించి "మా తండ్రి విషయం నీకన్నా తెల్పినవారుండరు. ఆయన ఎవరిని వరించాలని అనుకుంటున్నాడో తెల్పవలసినదని అడుగుతాడు. అప్పుడు సారథి యమునా నదీతీరంలో సత్యవతీ శంతనుల విషయం చెపుతాడు. ఇవ్విషయాన్ని పురస్కరించుకుని భీష్ముడు తండ్రి మనో వాంఛను నెరవేరుస్తాడు. దీనిని బట్టి సారథులు కూడ కొన్ని అత్యవసర విషయాలలో తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించే వారని తెలుస్తుంది.

నలుడికున్న అనేక అర్హతలలో రథ సారధ్యం ఒకటి. అశ్వ హృదయం తెల్పిన చక్కని సారధి నలుడు. శాపవశాత్తూ ఋతుపర్ణుడు దగ్గర ఉంటాడు. విదర్భలో దమయంతీ స్వయంవరం ప్రకటితమౌతుంది. దానికి ఋతుపర్ణుడు వెళ్ళగోరి బాహుకుడిని (నలుడిని) రథం ఆయత్తపరుస్తాడు. రథం వేగంగా వెళుతుండగా ఋతుపర్ణుని ఉత్తరీయం జారిపోతుంది. రథం ఆపు చేస్తే వార్షేయుడు వెళ్ళి ఉత్తరీయం తెస్తాడు అంటాడు రాజు. దానికి నలుడు నవ్వి మీ ఉత్తరీయం పడినచోటు నుండి ఇక్కడ దూరం ఒక యోజనం. ఎలా తెస్తాడు ఉత్తరీయం అంటాడు నలుడు. అంతటి రథ నైపుణ్యం కల్గినవాడు నలుడు. ఇక లోక బాంధవుడైన సూర్యభగవానుని రథానికి అనూరుడు సారథి.

సారథికి అనేక విషయాలు తెల్సి ఉండాలి. రథాన్ని అలంకరించటం నుంచి రణంలో నేర్పుగా సారధ్యం సలిపేటంతటి విషయ జ్ఞానం ఉండాలి. రథాన్ని వివిధ గతులలో నడపగలగాలి. రథికుడి మనస్సును ఆతని రణ పాండిత్యం తెల్సి ఉండాలి. శత్రువుల చేతిలో చిక్కే స్థితి ఎదురైనప్పుడు ధైర్యంతో నేర్పుతో రణరంగం నుంచి తప్పుకోవాలి. యుద్ధాల్లో సారథిని చంపివేయటం ఎక్కువగా జరుగుతూ ఉంటుంది. రథికుడుకన్నా ముందరగానే సారథి ప్రాణాలు కోల్పోయే సందర్భాలు ఎక్కువగా ఉంటాయి.

రథికులు :

రథం నుంచి శత్రువులపై పోరాటం సాగించే యోధుడిని రథికుడు అంటారు. ఈ రథికుల పోరాట పటిమను ఆధారం చేసుకొని కొన్ని శ్రేణుల క్రింద విభజించారు. అవి అతిరథ, మహారథ, సమరథ, అర్ధరథ శ్రేణులు. వీటిని రథిక చతుష్టయం అంటారు. మహాభారత సంగ్రామంలో ఇటువంటి శ్రేణీ విభాగం క్రింద చేరిన వీరాగ్రేసరులు చాలామంది ఉన్నారు. అయితే రామాయణ కాలంనాటికి పై విభాగం స్పష్టంగా నిర్వచింపబడినది.

తాదృశానాం సహస్రైస్తైః సమీ పూర్ణాం మహారథైః

ఇక్ష్వాకూణాం మతిరథియ శ్యాపర్య వరోపతి అను వాక్యమును వ్యాఖ్యానం ఇలా ఉంది.

ఇక్ష్వాకూణాం మధ్యే అతిరథః బహుభిర్మహా
రథైరేకో యోద్ధారథః

10,000 మంది ధానుష్కులతో పోరాడే వ్యక్తి మహారథుడు.

ఏనుగులతో, గుర్రాలతో, యోధులతో రథసారథులతో యుద్ధం సలిపేవాడు అతిరథుడు.

తన సారధిని గుర్రాలను పేనను రక్షిస్తూ యుద్ధం చేసే వాడు రథి.

భారతంలో యుద్ధం జరిగే ముందర భీష్ముడు కౌరవులలోని యోధులను నిర్ణయిస్తాడు. దుర్యోధనుడు, కృతవర్మ, శల్యుడు, భూరిశ్రవుడు మొదలగువారు అతిరధులు. దుర్యోధనుని సోదరులు, సుదక్షిణుడు, శకుని మొదలగువారు సమరథులు. సైంధవుడు మహారథుడు. కృపుడు, ద్రోణుడు అతిరథోత్తములు. కర్ణుడు, అవంతి దేశాధీశులగు విందానువిందులు అర్ధరథులు. ఇటులనే పాండవులలో ఉన్న యోధులను కూడ రథిక చతుష్టయ విభాగం క్రింద నిరూపిస్తాడు భీష్మాచార్యుడు. అర్జునుడు అతిరధ శ్రేష్ఠుడు. రథమును రథికుని సంరక్షించుటకు చక్ర రక్షకులుగా యోధులు ఉండేవారు. యుధామన్యుడు, ఉత్తమౌజుడు అనువారు కిరీటి చక్ర రక్షకులుగా ఉన్నారు. వీరు మహారధులు.

రథి, స్యందనారోహ అని రథికులకు పేర్లు. రథి అంటే రథము కలవాడని అర్థం. స్యందనారోహ అంటే రథం ఎక్కువారని అర్థం. రథాన్ని విడచి భూమియందు దిగినవాడిని చంపకూడదని మన ధర్మశాస్త్రం చెపుతుంది. గౌతమ ధర్మసూత్రాల యందు ఎవరిని చంపకూడదో చెపుతూ విసారథిని చంపకూడదని

ఉంది విసారధి అనగా సారధి చచ్చిపోయినవాడు. అట్టి సారధి లేని రథికునిని వధించకూడదు అచ్చంగా రథకుడు అను పేరు గల పురుషుడు భారతంలో కన్పిస్తాడు అతడు జయత్సేనుని కొడుకు

రథకారులు .

శతాబ్దాలకు తరబడి మన వాఙ్మయంలో రథాల చక్ర ఘోషలు విన్పిస్తూనే ఉన్నాయి కనుకనే వీని నాగిస్తున్న ఈ రథాలను తయారు చేసేవారెవరు? వీళ్ళను ఏమని పిలిచేవారు? నాటి వర్ణవ్యవస్థలో వీరికున్న స్థానం ఏమిటి? మొదలగు ప్రశ్నలకు చెప్పాలంటే సమాధానం కొంచెం కష్టమే నిర్దిష్టమైన వృత్తిని సుదీర్ఘ కాలంలో సాగించటం కుదరదు. కొత్తవారు ప్రవేశించి అందులో స్థిరపడొచ్చు. ఏది ఏమైనా అర్థవంతమైన ఆధారాలతో ఈ రథవృత్తి చేసేవారని గుర్తించవచ్చు

అసలు రథకారుడు అంటే 'రథం కరోతీతి రథకారః' రథమును చేయువాడు రథకారుడు వైశ్య స్త్రీకి క్షత్రియుని వలన పుట్టినవాళ్ళను మాహిష్యులని అంటారు. శూద్ర స్త్రీకి వైశ్యుని వలన పుట్టినవాళ్ళను కరిణులు అని అంటారు ఇప్పుడు కరణ స్త్రీకి మాహిష్యుని వలన జన్మించినవాళ్ళు రథకారులు అని శాస్త్రాలు చెపుతున్నాయి అయితే దీనికి భిన్నమైన సమాచారం వేదం మనకి అందిస్తుంది

ఋగ్వేద కాలంనాడు రథాలను తయారుచేసే వర్గాన్ని భృగువులు అని పిలిచేవారు 'భృగవే రథమ్' (10-39-14) అనే ఋక్కు ఈ సంగతిని స్పష్టపరుస్తుంది ఈ భృగువులు బ్రాహ్మణ తెగకు చెందినవారు అంగీరస తతయము ... ఉపగణాన్ని రథకార అనే పేరుతో ప్రసిద్ధులై ఉన్నారు అయితే భారతంలో భృగు శబ్దానికి 'కుమ్మరి' అని కూడ అర్థం ఉంది మనువు మొదలైన స్మృతి ఈ రథకారులు అని విశ్వకర్మ పురాణం చెపుతుంది

మనోః శిలే పంచభేదాః కారిపో రథకారకాః
కర్మ్యవశ్మశిల్పి నైష్ఠ్యం చరమాః స్వర్ణకారకాః 20-3

రథకారులు, కంసాలులు, శిల్పులు, స్వర్ణకారులు వీరంతా బ్రాహ్మణులుగానే చెప్పబడుతున్నారు ఈ రథకార బ్రాహ్మణులకు యజనాది షట్కర్మలతోపాటు వాస్తు, ధ్వజ, ప్రాసాద, గృహ, హర్మ్యాది నిర్మాణాలు, జపహోమాలు మొదలగు స్వభావ సిద్ధములై కర్తవ్యములై ఉన్నాయి

విశ్వకర్మకు అతని శిష్యులకు రథకారులు అను సంజ్ఞ కలదు అది ఇలా ఏర్పడినది.

త్రిపురం దగ్ధం కామస్య శివస్య పరమేష్ఠినః
రథంతు జగదాకారం కృతవాన్ పరమం శుభం
రథకార ఇతిప్రోక్తా విశ్వకర్మాన ఏ వహి"

రథకార అంటే వడ్లవాడని, స్వర్ణకారుడని అర్థాలు కూడ ఉన్నాయి

ఈ రథాలు తయారుచేసే వర్గం ప్రజా సమూహంలో ఉపయోగపడుతూ ఉండే రథం జీవన వ్యవహారం నుంచి తొలగిపోయిన తర్వాత వీళ్ళు ఏం చేస్తూ ఉండేవాళ్ళు అనేది తెలియుట లేదు వృత్తులు నాశనమైన కులం నాశనం కానట్లు వీరి ఉనికి ఎక్కడైనా ఉందేమో! ఈ రథకారులను గూర్చి నిజానికి విలువైన విస్తృతమైన ఆధారాలు దొరకాల్సి ఉంది అవి దొరికినప్పుడు వీరి శ్రమను, వీరి శ్రమైక సౌందర్యాన్ని అంచనా కట్టడానికి వీలుపడుతు

భారతీయేతర రథచరిత్ర :

భారతీయుల సంస్కృతి యందు రథం, తద్భావన విడదీయ రానిదై పెనవేసుకున్నది మనకి ఎప్పటినుంచి రథ విషయాలు ఆధార పూర్వకంగా తెలుస్తున్నాయో ఆ కాలమునకు అటూ ఇటూగా భారతీయేతర దేశములందు రథాల యొక్క విషయాలు పుస్తకములలో గోచరిస్తున్నాయి.

టెల్-హలాఫ్ దశలోనే ఉత్తర సిరియాలో చక్రాల బళ్ళు ఉన్నట్లు అస్పష్టంగాను, క్రీ పూ 3000 ప్రాంతంలో 2 చక్రాల బళ్ళు, 4 చక్రాల బళ్ళు ఉన్నట్లు స్పష్టంగా "గారా"లో లభించిన ఆధారాలున్నాయి బండి చక్రాన్ని 3 చెక్క ముక్కలతో కలిపి తయారు చేసేవారు వీటిని రాగి మేకులతో బిగించి తోలుతో కట్లు కట్టేవాళ్ళు. ఇది ఇనుప పీలవలె తిరుగుతుండేది క్రీ పూ 3000 తర్వాత రథానికి గుర్రాలను కట్టే పద్ధతి ఆ కాలవారికి తెలిసింది అయితే పశువుల బలాన్ని చక్రాన్ని రవాణాకు వాడుకోవటం క్రీ పూ. 4వ సహస్రాబ్దంలో ప్రారంభమైంది మృత్తుమీద స్పష్టమైన రూపుతో వినియోగంలోకి వచ్చిన ఈ బళ్ళు లోహయుగ కాలంలో వ్యాప్తి పొందినట్లు స్పష్టమౌతుంది

క్రీ పూ 3000 సం॥లలో ఈజిప్టులో రథాల వాడకం గూర్చి చారిత్రక ఆధారాలతో తెలుస్తుంది. ఈజిప్షియన్స

హైక్సాప్ గుర్రాలను యుద్ధ రథాలను లాగటానికి ఉపయోగించే వారు. సుమేరియన్లు గాడిదలతో రాజుల రథాలను లాగించేవారు ఈ రథ చోదనంలో ఉపయోగపడే గాడిదలకు కట్టిన పగ్గాలు అంత శ్రేష్ఠంగా ఉండేవి కావు. వీరి శిల్ప చిత్రాలలో కాయ్యతో చేసిన రథా లున్నాయి. చక్రాల వట్టీలను రాగి రేకులతో కట్టు కట్టినట్లు కనిపిస్తుంది. వీరి నాగరకతలో భాగమైన ఉర్ పట్టణంలోని రాజకుమారుల గోరీలను పరిశీలిస్తే ఒక అంశం తెలుస్తుంది. ఆతని అంగ రక్షకులను, దాసదాసీ జనాలను, రథాలకు కట్టిన ఎద్దులను చంపి రాజకుమారునితో పాటు పాతిపెట్టిన నిదర్శనాలు కనిపిస్తాయి. ఇటువంటి సాక్ష్యాలను అనేకం చూసి కాబోలు ప్రముఖ చరిత్రకారుడైన మోతిచంద్ "బహుశా సుమేరియన్లో మొట్టమొదట రథాలు ఉద్భవించినట్లు తెలుస్తుంది" అని తన అభిప్రాయం తెలిపారు. క్రీ.పూ. 2000 నాడు ఏషియా మైనరులో అశ్వ శకటా లావిర్భవించినట్లుగా కన్పడుతుంది. ఇదే సమయంలో బాబిలోనియా వాళ్ళకు గుర్రాల వాడుక తెలిసేది కాదు. వీళ్ళు రథానికి ఎద్దులను లేదా గాడిదలను కట్టేవాళ్ళు. యువాన్ మిశ్ర దేశాలలో క్రీ పూ. 1500 నాటికి గాని రథాల వాడకం వారు తెల్సుకొని వినియోగం లోనికి తెచ్చుకున్నారు. కాని కస్సైట్లు, హిట్టైట్లు, గ్రీకులు గుర్రాలను స్వారీకి కాకుండా రథాన్ని లాగటానికి ఉపయోగించుకునేవారు.

క్రీ.పూ. సుమారు 1400 సం|| మెడియన్ ఆర్య తెగలు ఉర్మీ సరస్సు వద్ద తమ నివాసాలను స్థిరం చేసుకున్నారు. దయార్ద్ర హృదయులైన 'నాసత్య' పుడికి గాడిదలను పూన్చిన రథం ఉండు ... ముందు కాలానికి ... తెలియని విషయం.

[ఇంకా వుంది]

## తమోదీపం

నిన్ను నమ్మి
కన్నీళ్ళను కానుక పెట్టి
మన్నించని మనస్సులో
మందారాలు పూయించి
నీ పాదాల పారాణి సాక్షిగా
నిలువెల్లా పులకించిపోతూ
నివేదించుకున్న నిముషంలో
నీ చూపుల శూలాలు
నా గుండెల్లో దూసుకుపోయాయి
నీ మాటల ఈటెలు
నా హృదయాన్ని సూటిగా తాకాయి
నీ హృదయానికి
కరగటమంటే తెలియక
కదలటమంటే కుదరక
దొర్లిపడే పాషాణంలా
నా బ్రతుకు మీదికి జారింది
ఇప్పుడు
నా గతమంతా రక్తసిక్తం
నా మనస్సంతా అనురాగ స్నిగ్ధం
నా తలపుల్లోని భావాలు
చీకట్లకు వ్రాసిన వ్యాఖ్యానాలు.

డా॥ నూరం శ్రీనివాసులు

## హింసకు దూరంగా దూరంగా

అక్కడికి వెళ్ళిపోవాలని ఉంది
అక్కడే స్వేచ్ఛగా ఆనంద గీతం పాడాలని ఉంది
ఈ హింసని సహించలేను
ఈ హింసని భరించలేను
మనిషి కోసం మనిషి బతికే
మానవతా ప్రపంచం ఎక్కడ నేస్తం!
అక్కడికి వెళ్ళిపోతాను
అక్కడికి వెళ్ళిపోతాను

శ్రీ తిరునగరి

## జటపాళీలు

తల నీలాల్లో కుసుమాల్లా
చీకటి అవరిస్తే
తారలు, జాబిలి, పాలపుంతలు.
వెలుతురు కురిస్తే విశ్వంభర జడ కుచ్చుల్లా
తరులూ, గిరులూ, పురములూ.
ప్రకృతి కాంతకు
నింగీ నేలా అద్భుతమైన జటపాళీలు
రాత్రీ పగలూ రమ్యమైన మణి ముకురాలు.

శ్రీ శైల కృష్ణారావు

# గణపతి నుతి

## ఆదిత్యమాల

ముని యిట్లుండగ వలెనని
జనమున కాకరీతి జూపి జగమున విద్వ
న్మణియై ప్రభలం జిమ్మిన
గణపతిమునిం గణపతిగను గణుతింతు మొదల్ 1

రమణుని శ్రీరమణునిగా
విమల మతిం దెలిపినట్టి విజ్ఞాన ఘనుల్
అమితాభులు శాస్త్రకళా
గమవేదులు కావ్యకంఠ గణపతి మౌనుల్ 2

ఆఖువాహుడు విద్యల కాదిగురువు
అతడె గాకున్న నాయన కఖిల విద్య
లలవడునె పూర్ణముగనే కొఱంత లేక
తరమె మానవ మాత్రున కరసి చూడ 3

ఊరక పుట్టెద రందరు
కారణ జన్ములుగా గణింపగా నెందరు యీ
ధారుణి విశాలమైనను
భారత మందెంత యగున్ పరికింపంగన్ 4

భువనేశ్వరీ ప్రసాదము
భువియందున నెవరి కబ్బు పురుషుండైనన్
సవనములు సేయునేనిన్
నవినయ పుత్రునకు గాక జగతీ స్థలిలోన్ 5

ఢుంఠి గణపతి యవతారమంట నతడు
కల్లగాదిది మరి యెవ్వరల్లలేదు
తండ్రి నరసింహ శాస్త్రిల తపము కలిమి
కారణము లేక కలుగునే కార్యమెపుడు 6

మంత్రమున మహిమ గలదని
యంత్ర యుగమ్మునకు దెలుపగా వలసి యిలన్
తంత్రముల, స్వతంత్రతకు
తంత్రమ్ముల వలన గావ ధరణికి దిగియెన్ 7

ఛిన్న శిరస్కోపాస్తిని
భిన్న కపాలుండునై విభిన్న తనువునన్
మన్నెను గణపతియే గా
కున్నన్ తల పగిలి బ్రతుక నొరులకు వశమే 8

దేవభక్తి తోడుగా దేశభక్తి
యొప్పుచుండును గణపతి యుత్సవాన
నటులె నారెండు గన్పట్టు సమలముగను
మౌని గణపతి జీవిత మార్గమందు 9

నాయన యనిపించుకొనన్
ఈ యుగమున సాధ్యమౌనె యేరికి నైనన్
నాయన యని రమణుడు నా
ప్యాయమ్మున బిలిచె నతని నద్భుతము గదా! 10

కలియుగ వశిష్ఠ మునియై
విలసిల్లిన కావ్యకంఠు విద్యా విభవున్
తెలిసి పలుకంగ నెవ్వరి
వలన యగున్ మరల బుట్టవలె వ్యాసుడాగిన్ 11

కందుడగునట రమణుడా కందు దెలిపి
తాను గణపతి ననియెడి మాట చెప్పె
అందుచే కందగీతాల కందినంత
పలికితివి వారి మహిమల కొలది కొలది 12

శ్రీ కపిలవాయి లింగమూర్తి



## సుప్రసన్న కవిత్వ శైలి - సంక్షిప్త పరిశీలన

సుప్రసన్న పద్యము వ్రాయగలరు. వచన కవితా వ్రాయగలరు. హృద్గీత (1954), అధునా (1964), శ్రీ పాంచాలరాయ శతకము (1977), స్తుతి ప్రబంధము (1988) — ఈ రచనలలో సుప్రసన్న పద్యము మాధురీ మహిమను చూపింది. ఋతంభర (1974) శతాంకుర (1987) - ఈ రెండూ వచన కావ్యాలు. వచన కవిత్వ శైలి గురించి ఈ వ్యాసంలో సంక్షిప్తంగా వివరిస్తాను.

తెలుగులో అనాదిగా ప్రాచుర్యంలో ఉన్న భాషా శైలులు మూడే. 1) ఆదికవి నన్నయ ఆరంభించిన మార్గశైలి. 2) పాల్కురికి సోమనాథుని వంటివారు ఉపయోగించిన దేశి శైలి. 3) జానపదులు నేరుగా జీవితంలో సాధించుకున్న జానపద శైలి. సుప్రసన్న కవిత్వ భాషా శైలి మార్గశైలినే ఎక్కువగా కలిగి ఉన్న మాట నిజమే. అయితే దేశి శైలిని కూడా కొన్ని ఖండికల్లో ప్రదర్శించక పోలేదు.

కడవలు రెండు పట్రండిరా
కన్నీళ్ళు పట్టడానికి
ఇక్కడ ఏడుస్తున్నాడు
ఎవ్వడో యుగాల నుండి
-ఋతంభర (55 పుట) శీర్షిక - కన్నీళ్ళు.

గుడుగుడు గుంచం గుండే రాగం
తన బావిలో తాను పాడిందే శ్రీరాగం
బావి ముందు ప్రపంచం లేదు
బావి వెనుక ప్రపంచం కాదు.
-కన్నీళ్ళు - ఋతంభర (56 పుట)

ఈ రెండు ఖండికల్లోనూ దేశి శైలి కొట్టవచ్చినట్టు కనబడుతున్నది. ఋతంభరలోనే కాక—

'సూర్యుడితో పాటు మేల్కొన్న పూలు ఎన్ని వేలు
తెల్లగా నవ్వుతూ కాళ్ళపైనా పైకెళ్ళ పైనా-
కావి పీడని ఎవరై ఏళ్ళ పూలు
విందుదనం వండిన ఆరేళ్ళ పూలు'

అంటూ పాండిచ్చేరి గీతాల్లోనూ(పుట-3) అన్నాడు. పాండిచ్చేరి గీతాల్లో అక్కడక్కడా ఈ దేశి శైలి ఉంది. ఇందులో భావ నవ్యత చందో వినూత్నతా రెండూ సాధింపబడ్డాయి. పూలు మనుషులకు ప్రతీకలుగా తీర్చబడి కవిత్వ సౌందర్య పోషకాలయ్యాయి.

మేల్కొన్న నాకు కల
కదుల్తున్న నాకు కల
వరుసగా ఆవర్తించే కల
ఇయిన్నై మందికీ ఒకే కల —పాండిచ్చేరి, పుట-4

ఎదడ కదవలో ఇన్ని రంగులను చిలుకుతున్నాను
-శతాంకుర, పుట-23

ఇలా అక్కడక్కడా దేశి శైలిని సుప్రసన్నగారు సంపూర్ణంగా వినియోగించినా మార్గ శైలి ప్రభావమే హెచ్చు. అయితే సుప్రసన్నది కేవలం మార్గ శైలి కాదని చెప్పడానికి పై ఉదాహరణలను వివరణలనూ ఇచ్చాను.

'ఇంద్రియాల గొడుగు క్రింద విరిచిన నాకు తోచింది
సరస్వతీ చేపి మందహాసం తన్ను మలచుకున్న జలే ఖండా
సాధన దర్శనలనే రెండు కళ్ళు తెరచుకున్నట్లు....'
-పాండిచ్చేరి, పుట-7

ఇందులో దేశి శైలి మార్గ శైలితో సమ్మేళనం పొందింది.

ఈ చెలమలోకి చూస్తున్నాను
ఎపుడూ కదలాడే తరంగాలు
అంచుల్లో లీనమై పోతున్నాయి
సూర్య కిరణాల రంగులు తాకి
పటుగులతో ఫక్కున నవ్వుతున్నాయి
సాయంకాలం చెలమ రంగు మారిపోయింది
తరంగాల కదలిక మందగించింది
కొత్త కొత్త ఆకారాలు, వికారాలు.
—శతాంకుర 27

ఇందులోనూ మిశ్రమ శైలి రూపొందింది. 'అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు (1987-సం. పేర్వారం జగన్నాథం) అన్న వ్యాస సంపుటిలో డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు భాషా శైలి అన్న పేరిట ఒక వ్యాసం వ్రాశారు. అందులో చేతనావర్త కవుల భాషా శైలి ప్రసక్తి వచ్చింది. సుప్రసన్న సంపత్కుమార లిద్దరూ పండిత కవులనీ వీరికి మార్గశైలి సహజమనీ అభిప్రాయపడ్డారు. ఆ అభిప్రాయం సంపూర్ణ సత్యం కాదనీ వారి కవితలో దేశి శైలి కూడా ఉందనీ అన్య భాషా పదాలతో కూడిన మిశ్రమ శైలి కూడా అక్కడక్కడా ఉందనీ చెప్పడానికే ఇన్ని ఉదాహరణలు ఇవ్వవలసి వచ్చింది.

స్వప్నాల విమానాలు, కోరికల రాకెట్లు, చీకట్ల మహా సముద్రాలు, విరిగిన పాల వంటి ఈ రోజు, పాతసి గ్రామఫోను రికార్డు లాంటి తలలు, ఎదిగే గగనాణువుల తోట, చక్కని మనస్సు యొక్క అనుభూతి, శిలాఖండం చిగురించడం, కాలం పల్లటీలు కొట్టడం, రాత్రి నల్లంచు చీర చివగ కట్టుకున్న జరీ పోగు ఉషస్సు, కన్నీళ్ళే వీళ్ళ ఆస్తి - ఇలాంటివన్నీ సుప్రసన్న భావ వైచిత్రినీ, కల్పనా చాతురినీ, శైలీ వైశిష్ట్యాన్నీ వెల్లడిస్తూ మిశ్రమ భాషా శైలినీ సూచిస్తున్నవి.

వస్తూ ఉన్న ఆమె మట్టెల చప్పుడు ఈ ఆకాశం నిండా
మ్రమయ గాఢ భాషను సృష్టిస్తున్నది
తన చూపులతో కట్టిన పూలదండల ఊయల మీద
సృష్టి పసిబిడ్డయై కేరింత లాడుతున్నది -శతాంకుర-56

ఈ పాదాల్లో మిశ్రమ శైలి ఎక్కువగా ఉన్నట్లు గ్రహించవచ్చు ఎందుకంటే ఇందులో తత్సమ పదాలకన్నా దేశి పదాలు ఎక్కువ. సమగ్ర సౌందర్య గుణ పచన కన్నా వ్రాయడానికి కవితలానులకమని చెప్పడానికి పైన చెప్పిన పద్యం ఒక ఉదాహరణ. తత్వజిజ్ఞాస ఇతోధికంగా ఉన్నా అభివ్యక్తిలో సాధారణత్వాన్ని, సార్వజనీనతను సంతరించిన ఒక విశేషం దీనిలో రెండు మనోహర భావచిత్రాలున్నాయి. వస్తూ ఉన్న ఆమె మట్టెల చప్పుడు మ్రమయ గాఢభాషను సృజించడం, చూపులతో పూలదండల ఊయల కట్టడం - ఈ రెండూ మనోహర భావ చిత్రాలే. వీటినే ఆంగ్లంలో ఇమేజెస్ అంటున్నారు. ఈ భావ చిత్ర సృజనలో కవి ఊహాశాలిత, కల్పనాశక్తి, అంతర్మథనం పాత్రధారణ చేస్తున్నాయి కవితావేశం మూలంగా భావానికీ పదాల కూర్పుకూ ఇదమిత్థమని చెప్పవీలుగాని సమతౌల్యతను స్థాపించడం ఇందులో ఉంది. పై వచన పద్యంలోని రెండు వాక్యాలకూ గణాలు, మాత్రలు అన్వయించడం కుదరదు. అయినా అందులో ఒక విలక్షణమయిన నడక లేదా లయ స్ఫురిస్తూనే ఉంది. ఇట్టి లయ భావ సంబంధి కనుక దీనిని భావ లయగా గ్రహించవచ్చు. కవి అంతటితో ఊరుకోక శబ్ద శిల్పాన్నీ తీర్చి దిద్దాడు. అక్షర రమ్యత లాంటిదేదో అవ్యక్తంగా మనసును తట్టిస్తున్నది. అంటే శ్రోతృ హృదయంలో ఒక వినూతన భావావేశగత సంస్కార ముద్రను వదేస్తున్నది దీనిద్వారా కవిత్వానికి మరింత సార్థకత లభ్యపడుతున్నది. పారమార్థిక భావనా విహారం విజయవంత మవుతున్నది.

క్షణాలు రాలిపోతున్నవి,
క్షణాలు పూయబోతున్నవి
ఈ రాగ లహరిలో నీవు నిల్చున్న బిందువే అమృతం.
శతాంకుర-36

క్షణాలు రాలిపోవటం - కాలం యొక్క చలన శీలం గురించి చెప్పటమే. పూయబోయే క్షణాలు ఎపుడూ అందీ అందని ఆకాశ కుసుమాలే భవిష్యత్ కాలమన్నమాట మనం నిలుచున్న బిందువు - ఈ క్షణానికి, వర్తమానానికి సంకేతం. వర్తమానం యొక్క ప్రాముఖ్యతను విశదీకరించి కవి చివరి పాదాలలో వర్తమానానికి విస్తృతార్థ కల్పనం చేశాడు 'చైతన్యపు కాగడాలో నడిచేవాడికి కాలమంతా వర్తమానమే అన్నాడు. గతమూ ఆగతమూ ఇప్పటి క్షణానికి మనో దర్పణంతో ఏర్పడ్డ నీడలు' అన్నాడు 'నాదమూ చిత్రమూ రెండూ కలసి శబ్దాలలో సాక్షాత్కరిస్తే ఆ రూపం కవిత్వం' అని మాదిరాజు రంగారావు గారు 'కాలాన్ని నిలిపి క్షణం' అన్న కావ్యం పుట-33 (1979)లో అన్నాడు దీనికి ప్రబల నిరూపణలుగా - శతాంకురలో తొంభై శాతం ఖండికలూ నిలబడగల శక్తి గలిగిన అమృతమయ కావ్య శకలాలే. పదాలకు అర్థాలే కాదు పరీమళమూ ఉన్నది, పక్షాలూ ఉంటాయన్న భావుకుల అభిప్రాయం ఈ క్రింది పాదాలు చూస్తే నిజమనిపిస్తున్నది

దారిని దాటిపోవగన్నే పూలు పలకరించాయి.
శిల్పకళా సృష్టి పూచిన ఆకాకృతిలా
స్వర రాగ భావ తాళ లయలు అన్నీ
ఒకే కాలం నుంచి వచ్చిన ఊట పైన
సృజన కాల భూమికలా___
ప్రతి కొమ్మ పండుగనాటి బాలవాటికలా
ఐదు జ్యోతులు వెలిగిన దీపపు కొమ్మగా
___శతాంకుర-92

ఈ ఖండికలో మొదటి పాదము చివరి పాదమూ ఒకే విధంగా వున్నవి. దారి నిండా దేవగన్నేరు పూలు పల్కరిందాయి. మధ్యమున్న పాదాలన్నీ ఉపమాత్మకాలైన భావ చిత్రాలు. భారతీయ సంస్కృతి పట్ల అభినివేశం మాత్రమే కాక విశ్వ మానవీయ చేతన పట్ల ఆదరమూ ఇందులో వసలెత్తినది. దారి అన్నది ఆతని అన్వేషణా మార్గమే. అది భౌతికము కాదు. పార మార్థికమే. గన్నేరు పూలు కూడా సదాలోచనలకు సద్భావనలకూ సంకేతాలే. సుందర మయమైన సత్యమైన శివమైన ఆనంద కాంతులే.

'ఈ నూతన సంవత్సరానికి సూర్యుడే గ్రీటింగ్ కార్డు'

-శతాంకుర-22

'గ్రీటింగ్ కార్డు' అన్నది మన సంప్రదాయం కాకున్నా, అది స్నేహ పరిమళాత్మక మైనందున స్వీకృతం. కేవల సాంప్రదాయికతను ఏ ఆధునికుడూ అనుసరించలేడు. అభివ్యక్తిలో భావనలోనూ నవ్యతను కవి సాధించినాడు అని చెప్పడానికి ఇదొక ఉదాహరణ. 'జీవితం నా జెండా' అని నాలుగో పుటలో (శతాంకురలో) అన్నాడు. సంప్రదాయం మాటికి మాటి కాతం పరిపూర్ణంగా స్వీకరించే కవి ఈ మాట అనలేడు. తాను 'పాతాళం నుంచీ సత్యలోకం దాకా' వ్యాపించాడు. 'మనస్సు గీచే లక్ష్మణరేఖ'ను దాటేశాడు. ఇందుకు ఎంతో సంస్కారం, చిత్తశుద్ధీ, సాధనా అవసరం. జీవితం నా జెండా అన్నది ఆరంభ వాదం. క్రియారహితం. ఈ నక్షత్రకాలలో అన్నీ చిందర వందరలే అని పన్నెండో పుటలోనూ అన్నాడు. 'ఫాల్గుణ శుద్ధ ద్వాదశి వెన్నెల' అనీ 38వ పుటలో కూడా అన్నాడు. ఇవన్నీ క్రియా రహిత కావ్య శకలాలు. అనుభూతి తీవ్రతలో అంత స్మృతీవ గుణం మూలంగా కవి ఈ రూపాలను సంతరించి పెట్టాడు.

సుప్రసన్న పాద విభజనా విధానం కూడా విశిష్టంగానే ఉంటుంది. మొదటి పాదానికి చివరి పాదానికి ముడిపెట్టడం, మధ్యలో ఎక్కడో ఉన్న పాదానికి కొస మొదళ్ళు ముడిపెట్టడం, మొదలూ చివరా రెండూ ఒకే విధంగా రాసి మధ్యన ఉన్న పాదాలన్నీ వాటికి అన్వయించడం, ఇట్లా అనేక రీతుల్ని ప్రయోగ పూర్వకంగా చేశాడు.

'ఈ చిన్న మొక్కకే ఎన్నో అందమైన పూలు' అని 'శతాంకుర-50'లో అన్నాడు. ఇది ఆరంభ పాదం. ఈ పుటలోని చివరి పాదం 'ఈ పూలు - నూతన యుగ సంకేతాలు.'

అరవై అయిదవ పుటలో మొదటి నాలుగు పాదాలూ ఉపమలే. అవి సురఝరీ ప్రవాహానికి సంకేతాలు. ఆ నాలుగింటినీ చివరి పాదంతో ముడివేశాడు. అంతేకాదు.... తోచి, వెదకి, శ్రమించి, దూరి, చేరి చివరకు తెలుసుకున్నానంటూ తేల్చి వెయ్యడం తేలికైన వ్యవహారం కాదు. చింతనాగుణ ప్రకాండులైన పాఠకునికే ఇట్టి కవిత ఆస్వాదనీయంగా గోచరిస్తుంది.

'శ్రుతులు కలవకున్నా
కృతులు పోలకున్నా
ఉదయాస్తమయాలతో - ఉన్మీలన నిమీలనాలుగా
మన యిద్దరం."                -71. శతాంకుర

అనటంలో ఓ వైచిత్రి ఉంది. మనమిద్దరం అనవచ్చును కదా? అనడు. మన యిద్దరం అనే అంటాడు. ఆ ఇద్దరికీ మధ్య విభేదం స్ఫురించే విధంగా యదాగమం తీసుకొచ్చి పెట్టడంలో సంధి లేనిచోటును చూపించాడు.

పై కవితను అయిదు పాదాలుగా విరవవచ్చు. కానీ నాలుగు పాదాలుగానే ఎందుకు విభజించాడు? మూడో పాదం కవికీ తన మూలమైన దివ్యశక్తికీ మధ్య గల సంబంధరేఖ గురించిన భావ ఐక్యతా ప్రకటనా ప్రయత్నం.

భాసనా దీపం - అనుభవం దాని నీడ
జీవితం కలగలసిన వెలుగుల చీకట్లవాడ.
                ఋతంభర - 59

తీరిక గతం - కోరిక అనాగతం
వర్తమానం తీరని కోరికల స్వగతం.
                (యుగపద) ఋతంభర-60.

ఈ రెండు మినీకవితల్లోనూ మొదటి భాగాల్లో రెండూ భాసగణాలతో తూగును సాధించినాడు కవి. మిగతా రెండు భాగాల్లో ఒక్కొక్క పాదం మొత్తం ఒక్కొక్క భావగణంగా తీర్చిదిద్దటంలో ఆకర్షణీయమైన పద్యగతిని సాధించాడు. ఒక విధమైన తూగు ఇందులోని భావ గణముల ద్వారా ఉద్దీప్తమైంది. అంత్యప్రాస గూర్చి ప్రత్యేకించి చెప్పనక్కరలేదు.

ఈ ప్రేమ పారిజాతం ఎవరికోసం, నీకు తప్ప
ఈ మధుర శబ్దం ఎవరికోసం, నీకు తప్ప
నీ అనాహత సంగీతం ఉలినిధి ఎవరి కోసం, నీకు తప్ప
ఈ వినాకృతి సర్వాసుమమంజరి ఎవరికోసం, నీకు తప్ప
                శతాంకుర-79

ఈ పాదాల శబ్దమాధురి అలా ఉండనీండి. వినూతన ఛందోరీతికై ఇందులోనూ అన్వేషణ తప్పలేదు. అది ప్రాస అంత్య ప్రాస సహజంగా వచ్చి చేరాయి. అనాహత సంగీత జల విధి, వినాకృత సర్వాసుమంజరి - ఈ రెండూ కవి ఆత్మాన్వేషణాత్మకమైన మధుర భావములే. పరమాత్మకూ జీవునికి మధ్య వున్న గాఢ సంబంధాన్ని ధృవీకరిస్తూ ఉన్న ఈ కవితలో క్రాంత పోకడ కనిపిస్తున్నది. కవిలోని భావ తీవ్రత నిసర్గ సౌందర్యానికి మూలహేతువై భాసిస్తున్నది.

—పాతూరి రఘురామయ్య

## గాంధీ శతకం – సమీక్ష

భాగవతుల నృసింహ శర్మగారు గాంధీ శతకాన్ని రాశారు. "సాంద్రధీకంధి శ్రీ కర్మచంద్ర గాంధి" అనేది ఈ శతకంలో మకుటం. రామలింగేశ వేణుగోపాల శతకాలను అనుసరించి, తన కున్న లోకానుభవాన్ని పురస్కరించుకొని భాగవతుల నృసింహ శర్మ ఈ శతకాన్ని 1917లో రాశాడు. సూరమాంబా సూర్యనారాయణులు కవి తల్లిదండ్రులు. ఈ శతకాన్ని కవి అధిక్షేప ధోరణిలో రాసి ఉన్నాడు.

గాంధీ మహాత్ముని పేర రాసిన ఈ శతకంలో కొన్ని పద్యాల్లో గాంధీ మహాత్ముని వ్యక్తిత్వాన్ని, స్వాతంత్ర్యోద్యమంలో గాంధీ నిర్వహించిన పాత్రను కవి భక్తి పురస్సరంగా ప్రస్తుతించి ఉన్నాడు. గాంధీ మహాత్ముణ్ణి దైవంగాను, నారాయణాంశ సంభూతుడిగాను కవి వర్ణించాడు.

"శిష్ట జన పరిత్రాణాయ దుష్ట శిక్షణాయ ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి ప్రతియుగ"మ్మని నాడు పలికినట్టి ధర్మ వాక్యాన్ని 'పాలింపదగు నీకు' అని గాంధీగారిని కవి ప్రశంసించాడు "కాకియో లేకున్న గోటలో నివశించి, దాటింపలేవె వసంత ఋతువు" - అనే పద్యంలో గాంధీ స్వాతంత్ర్యోద్యమానికి చేసిన సేవ వ్యక్తమౌతుంది.

"ధరణి బహుజాతులైన హైందవుల యందు, నీదు మద్యపా వేశమై నెగడు గాక"-అనీ, 'ధర్మ సంస్థాపనార్థంబు ధరణి యందు, గార్యముల జేయ దలపెట్టు ఘన యశుండు, సకల కష్ట నష్టములకు జంకడెపుడు"-అనీ గాంధీని దైవాంశ సంభూతునిగ కవి పేర్కొన్నాడు.

వాకిట కావుందేందుకు నాడు బాణునికి పరమేశ్వరుడు వశమైనట్లు తనకీనాడు గాంధీ మహాత్ముడు లభించాడని, కారాగృహ వాసం శరీరానికే గాని ఆత్మకు కాదని కవి క్రింది పద్యంలో వివరించాడు.

సీ॥ "వాకిట గాపుండ బాణున కానాడు
ఫాలనేత్రుడు పట్టువడినయట్లు
తను గట్టవచ్చిన తల్లికి నాడు
గోపాలకృష్ణుడు పట్టువడినయట్లు
పాకశాసను వైరి బ్రహ్మాస్త్రమునకు నా
వాయుపుత్రుడు పట్టువడినయట్లు
గ్రహదార వశమున గ్రహణ కాలంబున
భాను బింబంబు పట్టువడినయట్లు

గీ॥ పట్టువడి తీవు నీకు లోపంబు గలదె
ధన్యతముడవు నీకు బంధంబు గలదె."

"మిత్రులు నీరనుచు శత్రులు వారంచు జనులు లోదలప రాదనుచు, అఖిల జనముల ప్రేమింపు డనుచు" చెప్పిన తత్త్వ విజ్ఞాని గాంధీ అనీ, 'వదువ నేర్చిన దాది సత్యంబు తప్పలేదని', పరసతి కాంక్ష సేయనివాడ'నీ, 'పరుల బాధలను తన బాధలుగ భావించిన వాడనీ, 'ఆత్మ వత్సర్వ భూతాని' అనే మతాన్ని అఖిల జనులకూ తెల్పినవాడనీ - కవి గాంధీని ప్రస్తుతించాడు.

"ఆడుది చేద్రిప్పునట్టి రాట బేకచక్ర వినిర్మిత స్యందనంబు" - అనే పద్యంలో, బాకులు లేకుండా, తుపాకులు లేకుండా, దౌర్జన్య రాహిత్యంతో, దృఢ సంకల్పంతో, దైవ బలంతో గాంధీ స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపి విజయాన్ని పొందాడని కవి గాంధీని కొనియాడాడు.

అధిక్షేప ప్రధానంగా రాసిన పద్యాల్లో అధికంగా పూర్వ కవుల అనుకరణ ఉంది. దేశ దుస్థితి, వివిధ వర్ణాల పతనావస్థ, అధికారుల దుర్వర్తన, కలియుగ ధర్మం, దుష్ట ప్రభువుల్ని విమర్శించిన తీరు పూర్వ కవుల్ని అనుసరించి ఉంది. విదేశీయుల పాలకుల వల్ల దేశంలో నెలకొన్న హీనస్థితిని, పరదాస్యాన్నంగీకరించిన దేశద్రోహుల కపట వృత్తిని, స్వదేశ చరిత్రను తెలియకుండా విదేశీయుల చరిత్రను తెలుసుకునేందుకు ప్రయత్నించే వారినీ, దుర్జనులను కవి అధిక్షేపించాడు.

దేశభక్తి లేనివారిని కవి, 'తోబుట్టు కౌరవుల దొంగిలు నగపాలి' తోనూ, 'ఆత్మజ గల బొమ్ములట మటించు జదుని' తోనూ, 'సహజ తోడ తెగించి సంగమించు జలధి'తోనూ

పోల్చెను. దేశభక్తి లేనివాళ్ళు పాపులనుచని కవి వారిని అధిక్షే పించాడు. దేశభక్తి లేనివాడు వృషభంతో, నిర్లజ్జయైన విధవతో సమానమని కవి నిందించాడు.

దేశ దుస్థితి :

స్వేచ్ఛా సుఖాలు లేక, కపట స్వభావంతో తోటివారిని ఆదుకోలేని మనస్తత్వం గల ప్రజలతో, వైద్య విహీనమై దేశం ఉందని కవి దేశ దుస్థితిని వివరించాడు. దేశంలో ధర్మకార్యాలు నశించినాయనీ, ప్రజలు కష్టాలతో వున్నారనీ, న్యాయం నాల్గు పాదాల మీద నడవడం లేదనీ, అతి కృపణులు ధనాఢ్యులైనారనీ, శ్రేష్ఠ కులజులు సేవకా వృత్తి పూనారనీ, దేశ ప్రజలు కలిమి లేక ఆపదల్లో వున్నారనీ, దాతృత్వమూ, ఔదార్యమూ నశించి కరుణ లేక భరత ఖండం జీవచ్ఛవమై వుందనీ, పన్నులు, జార చోరులు అధర్మ వర్తనులు అధికం కావడంవల్ల దేశంలోని హీన పరిస్థితి అధికమైందనీ కవి వివరించాడు.

కలియుగ ధర్మం :

పూర్వ అధిక్షేప కవుల వలె ఈ కవి గూడ, సంఘం లోనూ, వ్యక్తుల స్వభావంలోనూ కలిగిన మార్పులు కలియుగ ధర్మాలని భావించి వాటిని వివరించాడు ప్రపంచమంతా పాప భూయిష్ఠమైందనీ, ధర్మం నశించిందనీ, బ్రాహ్మణ ద్వేషం ప్రబలిందనీ, జనులు కపట వర్తనులైనారనీ, జీవహింస అన్యాయమూ అధికమైందనీ, కపట వేషం ప్రబలిందనీ, సత్య మనేది జగతికి స్వప్నమైందనీ, ద్యూతము, మధుపానం అధిక మైందని, పాపాత్ము లధికమైనారనీ, సామాన్యులకు రక్షణ లేక పోయిందనీ, నీతి నిర్ణయపరులు నీచమతులైరనీ, రాజులు దుర్మార్గ రతులైనారనీ, స్త్రీలు శీల రహితులైనారనీ, సుతులు పితృజన విద్వేషులైనారనీ, ప్రపంచమంతా పాప భూయిష్ఠ మైందనీ, వర్తకులు అన్యాయ వర్తనులైనారనీ, దాతల్లు ధనహీనులైనారనీ, పండితులు అవగుణ మండితులైనారనీ, దాసులంతా లోపీ దాసులైనారనీ, కలియుగంలో జీవించడం కష్ట మనీ కవి బాధపడ్డాడు.

సత్యం నశించిందనీ, వసుధా తలమంతా ఫలశూన్య మైందనీ, పెద్దలంతా కపటులైనారనీ, సోదర భావం శూన్య మైందనీ, సాధు బాధ, గోహింస సంభవించిందనీ, బ్రాహ్మణులు దుర్జనులైనారనీ కవి కలియుగం తీరును వివరించాడు. పుణ్యా త్ములు, సాధువులు, విద్వాంసులు, దాతలు, పతివ్రతలు, కలియుగంలో లేరని కవి వెత నొంది, కలియుగ ధర్మాన్ని స్పష్టం చేశాడు. ఈ దుస్థితి సంఘాన్ని, వ్యక్తినీ పతనావస్థకి తెచ్చిందనీ, నాడు నారాయణుడు కృష్ణావతారమెత్తి జగద్రక్ష ణకై చేసిన శపథాన్ని ఈ దశలో నిర్వర్తించమని కవి గాంధీని ప్రార్థించాడు.

జాతీయోద్యమంలో పాల్గొన్న సజ్జనులు, ఉదాత్తాదర్శాలు కలవారు కారాగార శిక్షలను అనుభవించి ఎన్నో బాధలకు గురైనా రని వారి దేశసేవా నిరతిని ప్రశంసించి, కష్టాలు ఉదాత్తగుణ సంపన్నులకే వస్తాయనే సత్యాన్ని కవి దృష్టాంత పూర్వకంగా క్రింది పద్యంలో నిరూపించాడు.

సీ॥ పలుకు తీపికి చిల్క పంజరమున చిక్కె,
గాకంబునకు నట్టి ఘనత గలదె
కమ్మని తావికి గట్టగాబడె పుష్ప,
గండు బిల్లికి నట్టి ఘనత గలదె
పోరాడి రణరంగమున జచ్చు గుజ్జంబు,
గార్దభంబున కట్టి ఘనత గలదె
అడవిలో వేటాడబడుచుండు మృగరాజు,
శునకంబునకు నట్టి ఘనత గలదె.

దే శ భ క్తి :

భారతదేశం విదేశీయుల పాలన వల్ల హీనస్థితి నొందిందని, పరదాస్యాన్నంగీకరించి తాత్కాలిక సుఖాల్ని ఆశించేవారు దేశ ద్రోహులై వర్తిస్తున్నారని కవి వారి కపట వృత్తిని దూషించాడు.

పరదేశం వారితో కూడి ఉన్న దేశ సోదరునితో మెలగడం కన్న మరణం ఎంతో మేలని, దేశద్రోహుల్ని, "గయ్యాళి యగు భార్య గలిగియుండుట కంటె సన్యాసియైయుండుట చాల మేలు" అనే పద్యంలో కవి విమర్శించాడు. హూణ విద్యను నేర్చి దేశీయ విద్యల్ని తిట్టేవారిని, పరదేశీయుల పద పద్మదాసులైనవారిని కవి అధిక్షేపించాడు. తన దేశ వస్త్రాలను వదలి, అన్యదేశ వస్త్రాలపై ఆశగొనడం ఇతర దేశాలకు మానమిచ్చినట్లని కవి, "తన సతిని బాసి పై యువతితో బోవుట తన సతిని బరులకు దార్చి నట్లు" - అనే పద్యంలో విమర్శించాడు.

"మావి మాకిమ్మన్న మాన్యంబు లిచ్చుటా? యీ మాట నోరెత్తి యనిన దప్పు, మా బిడ్డలం గట్టి మానంబు గాపాడు కొందు మంచవరాదు,.... స్త్రీ హత్య, గోహత్య, శిశు హత్య యత్యంత పాపంబు లనిన గోపంబు వచ్చు.... కాలు కదలింపరాదు దిగ్బంధనము, పాడి వచియింపరాదు వాగ్బంధనము" - అని

నృసింహ శర్మ బాధ నొందాడు. అల్ప పటిలాధికార గర్వాంధకార, బిలాళ వేష సంపాదిత స్వాంతుడైన బానిసకు నిజ భక్తి ఏల కల్గునని కవి, "ఘోరాటవుల యందు గుమ్మడు కోతికి గట్టాణిముత్యం కానుకేల" నని విమర్శించాడు. బానిసకు భక్తి లేదని వివరిస్తూ కవి, "సాతాని వానికి సంగీతం, షండునకు సాని, పాపికి వేదాంతం, మూర్ఖునికు నీతిబోధ, పులికి అహింసా ధర్మం సన్యాసికి కామశాస్త్రం" ఏలనని అధిక్షేపించాడు.

స్వదేశీయ స్థితి తెలియకుండా, విదేశీయ చరిత్రలు తెలుసుకో దలచినవారిని కవి,

"తన ఇంట నున్న రంధ్రముల జూడగలేదు చుక్కల లెక్కింప
బొక్కిపడును
సృష్టి నాటకము పీఠి కగా జూలదు కృత్రిమ నాటకం బిచ్చగించు
దన వారలెవ్వరో కానెఱుంగ దలంప డితరి దేశీయుల నెఱుగగోరు
దన కాంతకుం గల తనవి దీర్పగలేడు పరకాంత యన్నచో
బరువులెత్తు"

అనే పద్యంలో అధిక్షేపించాడు. తన దేశీయుల బాగు కోరక అన్య దేశీయుల బాగు కోరువార్ని కవి "అభిషేక తీర్థంబు నానజాలదు గాని కల్లు ద్రావుట కన్న పునత జూపు" అనే పద్యంలో అధిక్షేపించాడు. పుట్టి పెరిగినవాడు తన దేశాన్ని పూర్తి తెలుసుకోవాలని కవి, "వేదంబు చదివిన విప్రవరేణ్యుండు నిత్యాగ్నిహోత్రియై వెగడపలయు" అనే పద్యంలో వివరించాడు.

రాజులు

మూర్ఖ ప్రభువుల చిత్తవృత్తిని కవి, పూర్వ కవులననుసరించి అధిక్షేపించాడు. "ధన దేవతా భక్తి తత్పరులధిపులు న్యాయిక మార్గ మెట్లెరిగెదరు?" - అని కవి రాజుల చిత్తవృత్తిని వివరించాడు. బాహ్య సౌందర్యాలు, పెంపుడు జంతువులు, ధనము, అతుల కీర్తి, ఆయుధ శ్రేణి ప్రభు చిహ్నాలు కాదని, ప్రజల సంక్షేమమే ప్రధానమని కవి సూచించాడు. ధరణి నాథులు చక్రవర్తులని, అర్థము లేనివారని, సద్గుణహీనులని, సద్విద్యలేనివారికి చెప్పారు. రాజులు గర్వంతో కన్ను గానక ప్రజల శరీర శాశ్వతమని ఎల్ల విత్తాన్ని అపహరిస్తూ, నరపతులను ఎదిరిస్తూ ప్రజల యోగక్షేమాల్ని పట్టించుకోకుండా వుంటారని, "కన్న మాటన్న మాయన్న లుడుకుచు దురని, రాజుల్ని కవి అధిక్షేపించాడు.

క్రూరులు, పాప చిత్తులైన ప్రభువులు యాచక జనుల్ని చూచినంతనే కోపగించుకుంటారని, చెంతకు రాగానే అసహ్యించుకొంటారనీ, పండితుల్ని నిరాదరిస్తారనీ, అటువంటి రాజుల్ని అర్థించడం వల్ల ప్రయోజనం శూన్యమని కవి రాజుల చిత్తవృత్తిని అధిక్షేపించాడు.

"మందితయై యుండురంద పాలించునే సాగర వేష్టిత సకలభూమి,
బూడిద బొరలాడు గాడిద యెక్కునే హాటకమణి సంపిఠాసనంబు
పీధులం బరియించు బేపి శాసించునే వర పండితప్రోక్త పద్ధతులను
ఆకుల భక్షించు మేక నూటాడునే దుర్వార వైరి
సందోహములను"

—అని కవి నీచ ప్రభువుల్ని అధిక్షేపించాడు. "పర్థింపదగు లబ్ధ వసుధాధినాథుని" అని కవి చెప్పడంవల్ల మూర్ఖ ప్రభువుల పైన కవి కుండే ఆగ్రహం వ్యక్తమౌతూ వుంది.

కలికాల ప్రభావంతో రాజులంతా స్త్రీలకు దాసులైనారనీ, కవి ప్రభువుల అహంకారాన్ని, వారి అశక్తతనూ అధిక్షేప పూర్వకంగా వెల్లడించాడు. వేశ్యకు రాజుకు అభేదాన్ని కల్పించి,

"దర్శించినన్ జాలు దప్పకుండగ మనోవైకల్య మపుడె
సంప్రాప్తమగును
దురదృష్టవశమున సరసకేగిన జాలు దనకున్న ధనమెల్ల
ధ్వంసమగును
వాయెత్తి యొకమారు భాషించినం జాలు సకల పాపంబులు
సంభవించు"ను

అని వర్ణించి కవి తన రచనా చమత్కృతిని ప్రదర్శించాడు.

నాటి రాజనీతికి వేశ్యకు ఎట్టి భేదం లేదని కవి సరస ధోరణిలో 'ఒక చాయ దయ జూపు నొక చాయ హింసించు, పరుష ప్రియంబులు బలుకుచుండు'నని అధిక్షేప పూర్వకంగా వర్ణించాడు.

అధికారులు

ప్రజల క్షేమాన్ని విస్మరించి అధికారాన్ని దుర్వినియోగం చేసే అధికారి వర్గాన్ని కవి తీవ్రంగా విమర్శించాడు. అధికారుల గర్వం, వారికి ఉద్యోగం వున్నంతవరకు వెల్లువలు, వారి దర్ప కాత్కాలికము కవి విమర్శించాడు. తన పై అధికారి తనను దూషించాడనే కోపంతో ఇతరుల్ని దూషించే ఉద్యోగిని, 'సత్కృపి కార్యంబు జయుపజాలని యొజ్జ శిష్య బృందమును దూషించు భంగి' అని కవి అధిక్షేపించాడు. "జారిణి యొండు విష్ణు గరిష్ఠత జూపు బాపాత్మకుండు దైవభక్తి జూపు"ను అనే పద్యంలో గర్వాంధకారాన కన్ను గానకుండ అధికారాన్ని చూపే

వాడు జడుడని కవి చెప్పారు. రాజసేవకునకు వేశ్యకు అభేదాన్ని కల్పించి కవి వర్ణించిన విధం ప్రశంసనీయం.

సీ॥ భావంబునం గల భావంబు వచియింపకాలక
మందహాసంబు జేయు
వాలు జూపుల జూచు బలుకరింపగ బోవునంతలో
లోన సిగ్గావరింప
శృంగార చేష్టలం జేయు మెల్లగ బైట పవరించు
నెవమున జార్చుచుండు
బరులు జూచెదరంచు భయ మొందు వెండియు ధీరయై
తెగియింప దివుచుండు.

గీ॥ బిటికి తనమున సిరీతి భీతి చెంది
వెతచవుల్ గోరి తుదకు నీప్సితము చెడి
వనిత చందాన రాజసేవకుడు" అని కవి వర్ణించాడు.

గయ్యాళియైన భార్యకు ఉద్యోగికి అభేదాన్ని కల్పించి వర్ణించిన విధం, "వసిష్ఠోక్తులాడును పక పకమని నవ్వ నధికారమున్నట్టు లతిశయించు" అనే పద్యంలో తెలుస్తుంది. అల్పుడైన అధికారికి, కామాతురుడైన మర్కటంగానికి అభేదాన్ని, "అతి మదంబున గ్రొవ్వి యితర జనులను రంధ్రాన్వేషణంబును సరియుచుండు, లాలింపబూనకొలది మిక్కలి వెక్కి బింకంబుచే బిట్టు బిగియుచుండు" - అనే పద్యంలో కవి అధిక్షేప పూర్వకంగా వర్ణించాడు.

త్రాగుబోతు :

మద్యపాన మొనర్చేవారిని కవి అధిక్షేపించాడు. మద్యపానం వల్ల వైకల్యం, ధరణీపాతం, సర్వ సజ్జన దూషితా సహ్యం, సకల దోషాలు కల్గుతాయనీ, బాలుడి విధంగా బహుభాషియై, అజ్ఞానియై తూగులాడుతాడనీ, స్థల విచక్షణ లేకుండా శయనిస్తాడనీ, వస్త్ర విహీనుడై ఉంటాడనీ, మద్యపానం వల్ల సుస్థిర చిత్త విభ్రాంతుడౌతాడనీ, దానివల్ల పాపకార్యాలు చేస్తాడనీ, దానివల్ల దుర్గతిని పొందుతాడనీ, మోక్షాన్ని పొందలేడని కవి మద్యపానాభిరతుల్ని మందలించి హెచ్చరించాడు.

న్యాయవాది :

న్యాయ మార్గాన్ని వదిలి అన్యాయ మార్గాన్ని చేపట్టి బతికే న్యాయవాదిని కవి, "ఇతరుల నెక్కైన హింసించి, వంచించి వారి ధన మపహరించి, బలహీన జనుల బంధించి అన్యాయ వర్తనమున చరించునని" అధిక్షేపించినాడు.

మూర్ఖులు :

"మాంసభక్షున కహింసావ్రతము లేదు
త్రాగుబోతుకు సత్యంబు లేదు
వ్యాఘ్రంబునకు దయా గౌరవములు లేవు
కోతికి విశ్వాస గుణము లేదు
జారచోరులకు లజ్జా జ్ఞానములు లేవు
పాపాత్మునకు పాప పరుస లేదు
భూపాలునకు ధర్మబుద్ధి సుంతయు లేదు
అర్థహీనునకు ధైర్యంబు లేదు

గీ॥ అర్థకాంతకు సురత సౌఖ్యము లేదు,
బాదమాడెడువానికి సుప్తి లేదు
దానిసకునకుస్ శక్తి లేదు"

—అని కవి మూర్ఖుల మనస్తత్వాన్ని వివరించాడు

స్త్రీలు :

స్త్రీలను గూర్చి కవి వివరించిన తీరు గమనించదగింది. "పతి మాట జవదాటి యతి చరించిన బోటి మాయ గాదది పుట్ట తేలు గాని", అనీ, "అంకువోయిన చాన ప్రాణేశు దన్నుచో జోద్యంబుగా చూపుచుండు"ననీ, "స్వయ మర్ధచోరిణి పరిహాస భాషిణియగు భార్య భర్తకు హాని యంత్రము" - అనీ, "సుగుణ సంపద లేక సుందరియైయుండు నిల్లాలు భర్తకు మృత్యువని"- అనీ, "భర్త దుఃఖించు గయ్యాళి పడుప గాంచి" - అని కవి స్త్రీల చిత్తవృత్తిని అధిక్షేప ధోరణిలో వ్యక్తీకరించాడు.

నీతిబోధ :

నృసింహకవి యీ శతకంలో పూర్వ శతక కవులవలే నీతిబోధ చేసి, సంస్కృత శ్లోకాల్లోని భావాన్ని వివరించాడు. "సుశయాత్మా వినశ్యతి" యంచు వచియించు నార్యవర్యుల వాక్యమనృత మగునె" - అని, నిష్కామ కర్మ గల్గి, దైవభక్తి గల్గి ధైర్యంగా కార్యాలు నిర్వహించాల, కష్టాల తర్వాతనే సుఖం వుందనీ, అందుకు హరిశ్చంద్రుని, నల చక్రవర్తిని, ధర్మరాజు, శ్రీరాముడు మొదలైన వృత్తాంతాలను దృష్టాంతాలుగ చూపి, శాంతియుతుడై స్థిరత్వం గల్గియుండాలని, తన అహంకారమే తననుండి తొలగుననీ, కాబట్టి అహంకారాన్ని విసర్జించాలనీ, పరధన మాశించరాదనీ, భగవద్భక్తి కలిగి వుండాలని కవి నీతుల్ని బోధించాడు.

"ప్రసవ వేదనకు జంకి భయపడిన గాపురము సేయగలదె యేకాంతమైన", అనేది, "గంజి లేదని భర్త కసలుచుండు భార్య

యట్టి జూచిన క్షీరముద్భవమునె" అనేది కవి విమర్శనా దృష్టికి నిదర్శనం జాతీయోద్యమంలో వరదాస్య నివారణార్థం మదన మోహన, హజరత్‌మోహియను, అబ్దుల్‌ఖాన్ చేసిన సేవల్ని కవి ప్రస్తుతించాడు.

మహాత్మాగాంధీ సిద్ధాంతాల్ని ఆచరించాలనీ, స్వదేశ రక్షణ కొరకు ప్రాణాలర్పించినవారికి స్వర్గప్రాప్తి కల్గుతుందని కవి చెప్పాడు.

పై విధంగా ఈ శతకంలో కవి నీతిని, ధర్మాన్ని, దేశ భక్తిని బోధించాడు.

—డి. వి. శ్రవణ్‌కుమార్

# మిక్కవోయిన బెక్కెం కథ

శ్రీశైలం ప్రాజెక్టు క్రింద మునిగిపోయిన ప్రాచీన గ్రామాలలో ఇది కూడా ఒకటి. దీనికి తూర్పున నది హైళ్ళపై ఆ నది కీవలావల కపలేశ్వరం, మల్లేశ్వరం, సంగమేశ్వరం, సిద్ధేశ్వరం, సోమేశ్వరం అని పంచేశ్వరాలున్నవి కాబట్టి వానితోపాటు ఆనాడు ఇది కూడా ఒక ఈశ్వరంగా ఉన్నది.

బెక్కేశ్వరం కంటె మొదలక్కడ నరసింగయ్యపల్లె గొల్లగూడెం అనే రెండు గ్రామాలున్నవి నరసింగయ్యపల్లెలో ఒక ఆసామికి చాలా గోవులున్నవి. వీనిని గొల్లగూడెంలోని ఒక కాపరి కాసేవాడు. ఒకప్పుడు ఉన్నట్టుండి వానిలో ఒక ఆవు పాలియ్య మానింది. ఇంటివారేదైనా దృష్టి దోషం తగిలిందేమో అనుకని ఉపచారం చేసినారు కాని అది కుదిరలేదు

అపుడు యజమానికి కాపరిపై అనుమానం కలిగింది. ఆవు పాలు నీవే దినదినం పిండుకుంటున్నావేమో లేకుంటె దాని పొదుగు ఎందుకు పట్టిపోతుంది అని అన్నాడు దానితో మాట పడిన కాపరి ఆవును గమనించవలసి వచ్చింది

ఒక దినది సమీపంలోని కాటితోపు లోనికి వెళ్ళి అక్కడ ఉన్న ఒక పుట్టగడ్డనెక్కి దానిపై పాలు కురుస్తున్నది. వాటిని ఆ పుట్టలోనుంచి ఒక పిల్లికూన వచ్చి త్రాగుతున్నది. కాపరికది ఆశ్చర్యం వేసి వచ్చి ఆవు నదిలించినాడు కాని అది ఆ కూన విడువునిండా పాలు త్రాగేంతవరకు అక్కడినుండి కదల లేదు అంత అతడు వచ్చి ఆ సంగతి యజమానితో చెప్పినాడు

ఈ విషయం అతనికి కూడా ఆశ్చర్యం కలిగించి మరు నాడు తానే స్వయంగా గమనించటానికి వచ్చినాడు. ఆనాడతనికి ఒక గండు పిల్లి పాలు త్రాగుతూ కనిపించింది. అతడు వెళ్ళి గ్రామంలో ఈ విషయం చాటినాడు. అది విని ఆ మరునాడు మరి కొందరు చూడటానికి వచ్చినారు. ఆనాడు వారికి ఒక కుక్క అంతటి పిల్లి కనిపించింది అది చూసి వారు పుట్టలలో పాము లుంటవి కాని పిల్లులుంటాయా! అదని పిల్లి కుటుంబం ఏదో దీనిలో నివసించిందని తెందమనాడు పార గడ్డపార తీసికుని వచ్చి దానిని త్రవ్వినారు. అపుడందులో ఒక శివలింగం బయటపడింది.

పూర్వం ఇది కన్నడ ప్రాంతపు సరిహద్దు కన్నడంలో పిల్లిని "బెక్కు" అంటారు కాబట్టి వారు తమకు కనిపించిన పిల్లియే ఆ శివరూపం ధరించిందని తలచి ఆ స్వామిని బెక్కేశ్వరుడని పిలిచినారు.

ఆ విధంగా అక్కడ నేటి స్వామి వెలసిన పిమ్మట అక్కడ ఆలయం కట్టినారు. నరసింగయ్య పల్లె అక్కడికి జరిగి ఈనాటి బెక్కెం అయింది.

గ్రామం ఏర్పడిన పిమ్మట ఇక్కడ ఒక పెద్ద చెరువు వేయబడింది. అది ఈ ప్రాంతానికల్లా పెద్దది. అప్పుడీ ఆలయం తటాక గర్భం లోనికి వచ్చింది. అయినా భక్తుల రాకపోకలకు ఇబ్బంది కలుగలేదు. కాలాంతరంలో వారు కాశి మండి మరో రెండు శివలింగాలు తెప్పించి ఒకటి మేక్షేశ్వరుడని, మరొకటి సాక్షీశ్వరుడని బెక్కేశ్వరుని ఇరవనే ప్రతిష్ఠించి ఆ మూడు ఆలయాలకు విమానాలు కట్టినారు. చెరువు నిండినపుడు మాత్రం వాని పానపీఠాలకు నీరు తాకుతూ ఉండేది.

మా జిల్లాలో పుష్కరిణి కీవలావల శివకేశవ ప్రతిష్ఠ ఉన్నపుడు దాన్ని జనమేజయ ప్రతిష్ఠ అంటారు

ఈ బెక్కేశ్వరాలయ కాక ఇక్కడ గ్రామంలో ఒక పుష్కరిణి - దానికి ఒకవైపు శివాలయం మరోవైపు విష్ణ్వాలయ ఉన్నవి అవి పశ్చిమాభిముఖాలు. ఇక్కడి శివాలయంలో ఇపుడు శాంతరామయ్యగారి సమాధి ఉంది. ఆయన మల్లికార్జున పండితా రాధ్యుని శిష్యుడు.

పండితుడు పాముగంటిలో ఉదయమని తపించి బసవేశ్వరుని దర్శించి శ్రీశైలాన్ని సేవించటానికి బయలుదేరి "పనిపురం" చేరినాడు. దీని నిపుడు పనపర్తి అంటున్నారు. అక్కడికి చేరే వరకతనికి బసవేశ్వరుడు లింగైక్యం చెంది వారం దినాలైనట్టు తెలిసింది అది వినగానే పండితుడు దుఃఖంతో కూలిపోయినాడు.

పండితుని వెంట ఉన్నవారిలో గంగాపురం బసవయ్య-మియ్యాపురం పత్తెక్క, పనిపురి శంకరయ్య, వెల్లగొండ మహా దేవయ్య ఈ ప్రాంతానికి చెందినవారు.

వెల్లగొండ మహాదేవయ్యను స్థానికులు మయ్యన్న అని పిలిచేవారు. ఆయన ఒకనాడు చీకటిలో లేచి వెళ్లుతూ ఉండగా శివ పూజా వస్తువులు కాళ్ళకు తగిలినవి. అపుడది అతడు అపచారంగా భావించి కత్తితో పాదాలను నరుకుకోగా పండితుడు అది తెలిసి శివుని సన్నిధిలో వెలిగే దీపంలోని చమురు, అక్కడ ఉన్న విభూది ఆ పాదాలకు పూసి బాగుచేసినారు.

మహాదేవయ్య గూడా పండితుని వలెనే గొప్ప విద్వాంసుడు. ఆయన వాదంలో గురువుగారికి కుడి భుజంగా ఉండి అవసరమైన శ్లోక పాదాలందించేవాడు. చివరి దినాలలో ఆయన పూర్తిగా విరాగియై తన గ్రామం దగ్గర ఉండే గుట్ట పైననే జీవితం గడిపినాడు. అందుచేత భక్తులతని అనంతరం ఆ గుట్టపై అతని యొక్క అతని భార్య యొక్క ప్రతిమలు చెక్కించిపెట్టి ఆ గుట్టనతని గౌరవార్థం మయ్యన్న గుట్ట అని పిలువసాగినారు.

పండితుని దుఃఖం చూసి మహాదేవయ్య అతనిని తమ గ్రామానికి తీసికుని వెళ్ళినాడు. అతడక్కడ కొన్ని దినాలుండి శ్రీశైలానికి ప్రయాణమై వెల్లటూరి వరకు వెళ్ళేవరకు అతనికక్కడ కృష్ణా తీరంలో గల గుట్టల నడిమి నుండి శ్రీశైలం లింగాకారంగా దర్శన మిచ్చింది. అది చూచి పండితుడు దానిపై తన పాదాలు మోపటం పాపమని తలచి తానక్కడనే నిలిచి దోనమయ్య అనే భక్తుని పిలిచి ఈ శిష్యులను తీసికొని నీవు శ్రీశైలం వెళ్ళి నా మ్రొక్కులు చెల్లించి రమ్మని పంపినాడు.

ఆనాటి దోనమయ్యగారి శ్రీశైల యాత్ర నేటి ఉమామహేశ్వరం పైనుండి సాగినట్లు పండితారాధ్య చరిత్ర వల్ల తెలుస్తుంది.

దోనమయ్య అక్కడికి వెళ్ళి పండితుని మ్రొక్కులు చెల్లించగా వృద్ధ మల్లికార్జున దతనికి ఒక ముసలి జంగం రూపంలో దర్శనమిచ్చి అక్కడ ఉన్న తీర్థాలు స్థలాలు అన్ని వివరించినాడు.

దోనమయ్య అక్కడ మ్రొక్కులు చెల్లించి వచ్చేలోపల ఇక్కడ పండితునికి శాంతరామయ్య అనే మరో పండితుడు పరిచయమైనాడు. అతడు బెక్కెం నివాసి, విరూపాక్ష పీఠానికి చెందినవాడు.

ఆయన పండితుని తమ గ్రామానికి ఆహ్వానించినాడు. దాన్ని అంగీకరించి పండితు డక్కడికి వెళ్ళటానికి సిద్ధమైనాడు. అపుడు శిష్యులతని దగ్గర సెలవు తీసికున్నారు. మియ్యాపురం పత్తెక్క గూడా మయ్యన్నవలె గొప్ప భక్తురాలు. ఆమె అనంతరం అక్కడ ఊరి వెలుపల గల గుట్టమీద భక్తులామెకు గుడి కట్టినారు. అదిపుడుంది.

బెక్కెం గ్రామానికి సమీపంలో పూర్వపు గొల్లగూడెముంది. దానికి పడమట మూకగుళ్లు అనే ఒక ఆలయ సమూహం ఉంది. దానిలో పదకొండు గుళ్లున్నవి. వానిలో ఒకటి కాళికా దేవిది. ఒకటి నటరాజుది. ఒకటి భైరవునిది. ఒకటి సూర్యునిది. ఒకటి మహిషమర్దనిది. మిగిలినవి వేర్వేరు పేర్లతో గల శివలింగ ప్రతిష్ఠలు.

బెక్కెం వచ్చిన పిమ్మట పండితుడా ఆలయ సముదాయాన్ని దర్శించినాడు. అతని కక్కడి వాతావరణం నచ్చింది. అందుచేత గ్రామం వెలుపల ఒక స్థలం చూసి ఆశ్రమం ఏర్పరచుకొని నివసించినాడు. ఒక బావిని కూడా త్రవ్వించినాడు. చివరకు అతని అవసానం అక్కడనే జరిగింది.

ఈ సంచారంలో పండితుని కుటుంబం ఎపుడూ వెంటనే ఉండేది. అందుచేత శివైక్యం చెందిన పండితుని భౌతికకాయాన్ని అక్కడనే సమాధి చేసి అవాంతరయ్య మొదలైన అతని శిష్య వర్గం కుమారుడైన కేదారయ్యకు పీఠ పట్టాభిషేకం చేసి తోడుకొని వెళ్ళినారు.

బెక్కెం గ్రామస్థులీనాడు పండితుని సమాధిని మల్లెదేవర సమాధి యని అతడు త్రవ్వించిన బావిని మల్లెదేవర బావి అని పిలిచినారు. స్వాతంత్ర్యానంతరం ఈ బావి గ్రామస్థులకు మంచి నీటికి ఉపయోగకరంగా చేయబడింది.

పండితారాధ్యు డెంత ప్రసిద్ధి చెందినాడో అతనిని బెక్కెం తీసికుని వెళ్ళిన శాంతరామయ్యగారు కూడా ఆ ప్రాంతంలో అంతటి ప్రసిద్ధిని పొందినాడు. అందుచేత గ్రామస్థులతని దేహాన్ని గ్రామంలోని శివాలయంలో సమాధి చేసి ఏటా సేవ ఏర్పాటు చేసినారు.

ఇపుడు ప్రతి ఏటా కార్తీకమంతా అతనికి పూజలు సేవలు జరిగి మార్గశిర శుద్ధ పాడ్యమినాడు రథోత్సవం జరుగుతుంది. అపుడు ప్రజలు మల్లెదేవర సమాధిని మొదట పూజించి ఈ ఆరాధన ఆరంభిస్తారు. చివరినాడు రథయాత్ర గూడా అంతవరకు సాగుతుంది.

ఇక్కడ మార్జాలముఖి మార్జాల వాహనయైన దేవత ఉంది. ఆంధ్రదేశంలో ఈమె మరోచోట ఉన్నట్టు కనిపించదు. ఈ ప్రాంతంలో ఈ దేవత నుపాసించినవారు గూడా పూర్వం ఉన్నారు.

వెల్కిం బాగా ఉన్న కాలంలో కోట-పేట అని రెండు భాగాలుగా వర్ధిల్లిన పెద్ద నగరం. ఇక్కడి కోట చాలా విశాలమై దానిపై పదుమూడు బురుజులు. ఒక్కొక్క బురుజు దగ్గర ఒక పెద్ద ధాన్యపు గరిసె ఉన్నవి. శా.శ. 1033 ప్రాంతంలో జటప్రోలు సీమను ఇక్కడి నుండి చాళుక్య త్రిభువనమల్లుని సామంతుడైన బిజ్జనను పాలించినాడు. అతడు జీమూతవాహన వంశీయుడు.

ఈ వంశం గూడా ఆంధ్రదేశంలో మరెక్కడా కనిపించటం లేదు. మొదటి శాతకర్ణి కాలంలో కళింగం నుండి తెలుగుదేశంపై దండెత్తి వచ్చిన ఖారవేల మహారాజు జీమూతవాహన వంశీయుడు కాబట్టి బిజ్జనను పూర్వులు ఎక్కడివారో ఆలోచించవలసి ఉంది.

నేడు నాగర్ కర్నూలు తాలూకాలో బిజ్జనపల్లి ఒక మండలంగా ఉంది. అది ఇతని పేర ఏర్పడిన గ్రామం అయి ఉంటుందేమో కూడ.

ఈ బిజ్జరుసు ఉదగార పోషకుడుగా చెప్పబడినాడు. ఇది గూడా ఈ ప్రాంతంలో క్రొత్త పదవి. ఇక్కడి చెరువు చాలా పెద్దది కాబట్టి ఇతడు దానిపై జలరక్షకుడుగా కూడా ఉన్నాడనిపిస్తుంది.

ఈ గ్రామం ఒకపుడు రాజధాని కాబట్టి పూర్వం యిక్కడి చాతుర్వర్ణాలవారు ప్రసిద్ధి చెందినవారుగా ఉన్నారు.

బ్రాహ్మణులలో జోస్యంవారు, పత్రివారు, ప్రతాపగిరివారు చెప్పదగినవారు. జోస్యంవారు జ్యోతిషంలో దిట్టలు. ఈ వంశంలో అగ్రహారీకులు కూడా ఉన్నారు. పత్రివారు మహారాష్ట్రలోని "పత్రి" గ్రామం నుండి వచ్చి స్థిరపడినారు. ఇక్కడ ఈ వంశంలో కవి పండితులు వెలసినారు. పత్రి పురుషోత్తమశాస్త్రిగారు, వారి కుమారులు సత్యనారాయణ, విశ్వేశ్వరశాస్త్రిగారలు గత శతాబ్దంలో ఇక్కడ వెలసిన కవులు.

ప్రతాపగిరివారు అమరాబాదు సీమవారు. వీరు వైదిక విద్యలో దిట్టలు. ఈ వంశానికి చెందిన సోమసుందర శర్మగారు వెల్కిం గ్రామానికి మంచి పేరు తెచ్చినారు. వీరి ఆధ్వర్యంలో అక్కడ క్రీ.శ. 1943లో శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయం తెరువబడింది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో మంచి పని చేసింది.

ఇక్కడి క్షత్రియ కుటుంబాలలో కొత్తవారు, చల్లకొండవారు, జూపెల్లివారు, రంగినేనివారు అనే వెలమ కుటుంబాలవారు ప్రసిద్ధులు.

జూపెల్లివారు గొప్ప యోధులై ఆయా కాలాలలో సేనాపతులుగా ఉన్నారు. వారి పిమ్మట చెప్పదగినవారు అమరసింగు - బలసింగు - బలరాం - భగ్గుసింగు అనే బొందిలీలు. వీరానాటి ప్రభువుల దగ్గర సేనాపతులు.

పూర్వం ఈ గ్రామాన్ని రామరాజు అనే ఒక పాళెగాడు పాలించినాడు. అతని వంశం ఇక్కడ చాలా కాలం అధికారంలో నిలిచింది. కాని చివరి ఏళ్లలో వారవిసెయులు కాగా విజయనగర ప్రభువు లతనిపైకి "బలసింగు"ను పంపినారు. అతడు వచ్చి గ్రామాన్ని రామరాజు వంశీయుల నుండి జయించి దాన్ని జటప్రోలు ప్రభువుల కప్పగించి వారి దగ్గర సైన్యాధిపతిత్వాన్ని పొందినట్లు బల్సింగు వారి వంశ చరిత్ర వల్ల తెలుస్తుంది. ఈ వంశంలో ఇపుడు బల్వరిసింహ ఠాకూర్‌గారు మంచి రచయితగా కవిగా ఉన్నారు.

జటప్రోలు వారి దగ్గర బల్సింగు కంటె మొదట కొత్త చెలమయ్యగారు సైన్యాధిపతిగా ఉన్నారు. అతడిదే గ్రామ నివాసి. అతని ప్రభువులు కొంత కాలానికి కుట్రదారని శంకించి పదవి నుండి తొలగించినారు. అపుడతడక్కడినుండి వనపర్తికి వచ్చినాడు. అపుడు రాజా పెద్ద రామేశ్వర రాయలను నిజాం ప్రభువు బందీ చేసి హైదరాబాదు చెరలో ఉంచినాడు. అపుడతనిని దివాన్‌జీ గోవిందరాయలుగారు చెరసాల నుండి ఊరి వెలుపలికి పొరంగి త్రవ్వించి తప్పించుకొని తీసుకు వెళ్ళినాడు. అపుడా కార్యంలో అతనికి చెలమయ్యగారు సహాయం చేసి రామేశ్వర రాయలతో సర్దార్ చెలమయ్య అనే బిరుదును పొంది అనంతరం వారి దగ్గరనే నిలిచిపోయినాడు.[1]

సురభి మాధవరాయల అనంతరం అతని ముగ్గురు కొడుకులలో పెద్దవాడైన నారాయణరావు రాజధానిలో ఉండగా అతని పెద్ద తమ్ముడు తిరుమలరావుగారు ఇక్కడి నుండి రెండవ తమ్ముడు నరసింగరావుగారు ఎబ్రూరు నుండి అన్నగారికి సహాయంగా ఉండి రాజ్యాంగ వ్యవహారాలు చూసినారు.

ఇక్కడి వైశ్యులలో ఎలిపెట్లవారు, కొత్తవారు, నరహరివారు, విశ్వనాథవారు పేరు పొందినారు.

ఇక్కడి కోట చాలా పెద్దదని చెప్పినాను. ఈ గ్రామం చక్కగా ఉన్న కాలంలో దాని తొమ్మిదవ బురుజు దగ్గర రామ

1. గోవిందరాయలుగారు రామేశ్వర రాయలను తప్పించిన ఉదంతం నేను "మాతంగి క్షేత్రం - వెలికట్టి" అనేదానిలో తెలిపినాను. చూ. ఆరాధన, ఫిబ్రవరి, 1987.

మందిరం, తమిదల బురుజు దగ్గర శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయం, ఆరకల బురుజు దగ్గర పెద్దమ్మగుడి ఈశాన్య బురుజు దగ్గర కోట మైసమ్మ ఉన్నవి.

ఈ విధంగా ఒకప్పుడిది రాజధానిగా ఉండి కళకళలాడింది. కాని శ్రీశైలం ప్రాజెక్టు మునకతో ఈ గ్రామాన్ని ప్రభుత్వం క్రీ. శ. 1981లో వదగొట్టింది. ఇదిక్కడి ప్రసిద్ధ కుటుంబాల వారంతా దిక్కు దిక్కులా చెదిరిపోయినారు. కొరికొందరు క్రొత్త ఊరు కట్టుకున్నారు అయితే ప్రభుత్వం వారికి ఇండ్ల మావిజా యిచ్చింది కాని ఇక్కడి ఆలయాలను గురించి పట్టించుకున్నవారు లేరు

శైవ సాహిత్యంలో పండిత త్రయంలో ఒకడైన మల్లికార్జున పండితారాధ్యునికి ఎంతో ప్రాముఖ్యం ఉంది కాని ఈనాడు అతనిదని చెప్పబడుతున్న యిక్కడి సమాధి కృష్ణానదీ గర్భంలో బెకబెకల నడుమ బిక్కు బిక్కు మంటుంది

—శ్రీ కపిలవాయి లింగమూర్తి

## ‘గమకి అంటే ఎవ్వరు? గమకమంటే ఏమిటి?’

ఫిబ్రవరి ’90 ‘భారతి’ కలగూరగంపలో ‘బిజ్జకయ్య-కవి-గమకి-ఒక పరిశీలన’ అన్న వ్యాసంలో, డాక్టర్ ఆర్. శేషశాస్త్రి, ఎం. ఆదినారాయణ శాస్త్రిగార్లు, గమకి, గమక కళ-వీటిని గురించిన వివరములను తెలుపకోరినారు. అందుకు సమాధానం

తెలుగులో కావ్యపఠనం - కావ్యగానం అన్న పదములు అనాదిగ వున్నవే. కాని వ్యాసకర్త లన్నట్లు ‘గమక’ మన్న పారిభాషిక పదముగా ప్రసిద్ధం కాలేదని చెప్పవచ్చు

కన్నడ సాహిత్యంలో గమకం విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నది గమక కళపై విశేషంగా అధ్యయనం చేసి, కన్నడ దేశంలోని గమక కళా విశారదులలో అగ్రగణ్యులైన డాక్టర్ జోశవరాశి దొడ్డనగౌడగారు 17-2-50న షోలాపూర్ సాహిత్య సమ్మేళనంలో భాగంగా జరిగిన గమక గోష్ఠికి అధ్యక్షత వహిస్తూ చేసిన ప్రసంగం నుండి కొన్ని ముఖ్యాంశాలను వివరిస్తాను

‘గత్యర్థమైన ‘గమ్లు’ (గమత్) ధాతుజన్యం గమకం.

మనః ప్రేరకమైన నాదం నుండి వర్ణం - వర్ణం నుండి పదం - పదం నుండి వచనం - వీటి వన్నిటిపీ సమన్వయ మొనర్చి రాగబద్ధంగా పాడటమే గమకం. సంగీత శాస్త్రంలో “ఆరోహం అవరోహంచ ఢాలుస్ఫురిత కంపితాః ఆహతః ప్రత్యాహతశ్చ త్రిపుచ్ఛాందోళ మూర్ఛనాః” అని దశవిధ రీతుల నిరూపింపబడినాయి. ఈ దశవిధ గమకరీతులు, మంత్రశాస్త్రంలో దశవిధ బిందువులుగా పేర్కొనబడినాయి.

చెప్పవలెనన్న సంకల్పం కలిగిన ఆత్మ మనసును ప్రేరేపిస్తుంది. ఆ మనస్సు నాభిలోని (బ్రహ్మగ్రంథి) అగ్నిని ప్రజ్వలింపజేసి నాదోత్పత్తి కలిగిస్తుంది. దానితో గమకం రూపు దాలుస్తుంది. అచలమైన ఏకనాదములో అణగిన అనేకతను వ్యక్త మొనర్చుటకు కావలసిన చలనము తెచ్చుటను ‘గమకమ’ అంటారు.

గమకమన్న పాదములతోనే, సాహిత్యం చిన్నది. లేకున్న చలనం వుండదు వేదాగమ ఉపనిషత్తులు, పురాణేతిహాసాలు, కావ్యాలలో గమకం యొక్క స్థానం అనుమానం లేని హృదయం నుండి వెలువడే కావ్యం ఎంత గొప్పదైనా ప్రాణం లేని దేహం వంటిది. గమక సంజీవిని స్పర్శ వల్లనే కావ్యరసం భావలహరి జీవంతమై జగజ్జనుల హృదయ వీణను మ్రోగిస్తుంది. కన్నడ హరిశ్చంద్ర కావ్యకర్త రాఘవాంకుడు దీనినే ‘విమళ పదన్యాస నదె’ అన్నాడు

మంత్ర శాస్త్రవేత్తలైన మహాకవి భాస్కరాచార్య రామచంద్రస్వామి (బళ్ళారి) గమక కళను గురించి ఇలా అన్నాడు.

“హృదయంగమమైన శబ్దమయ శథార్థమును శ్రోతల స్వాంతము నంత్తి, రాగసుధా పోచనం కావించి ఆత్మ కిష్టమైన సృష్టిలో నిత్యమై, జీవికి అమరత్వాన్ని ప్రసాదించు భావ పరంపరల స్పందన కల్గించే శక్తి గమక కీలకం ”

సంగీత సాహిత్యాల అనుబంధమును గురించి వాదోపవాదములున్నాయి సాహిత్య ప్రాధాన్యంతో పాడిన సంగీత శాస్త్రమును ధిక్కరించినట్లేనని సంగీత శాస్త్రకారులు, సంగీత ప్రాధాన్యతతో సాహిత్యాన్ని గానం చేసిన సాహిత్య శాస్త్రానికి సమాధి కట్టినట్లేనని సాహిత్యకారులు పరస్పరం ఆరోపణలు చేస్తున్నారు. ఉభయ వాదములను అపగాహన మొనర్చుకొని సముచితమైన సమాధాన మివ్వగల శక్తి గమక కళకు మాత్రమే వున్నది. ద్వైతాద్వైతవాద మనే దరీ మణులను అక్కున చేర్చుకొని ముందు జ వేసిన శక్తి విశిష్టాద్వైతం ఎలా, సంగీత సాహిత్య సుందరీ మణులను మెప్పించి ఇష్టము వచ్చినట్లు ఆడించగల శక్తి గమకకళ కున్నది.

సంగీతంలో గమకమున కెంత ప్రాధాన్యత వున్నదో, సాహిత్యంలో కూడా అంతే విశిష్ట స్థానముంది. ఛందోబద్ధమైన

సాహిత్యానికే కాక, వచన సాహిత్యానికి కూడా గమకం యొక్క ఆవశ్యకత వుంది. వచనములను కూడా రాగతాళములతో గానం చేసే పద్ధతి ప్రాచీన కాలం నుండీ వుంది ఈనాటికీ కథలను రాగయుక్తంగా (గ్రామ ప్రాంతాల్లో ఎక్కువగా) పాడేవారున్నారు. బసవేశ్వర, అక్కమహాదేవి, చెన్నబసవ సిద్ధరాము, ప్రభుదేవుల వచనాలను రాగ తాళాలతో గానం చేయటం కర్ణాటక ప్రాంతంలో ప్రచలితంగా ఉంది.

గమకి లక్షణమును గురించి శ్రీ ఎం. రాఘవేంద్రరావు తమ 'గమకి' అన్న గ్రంథంలో ఇలా అన్నారు.

"ఒత్తిశుద దీర్ఘస్వర
దుత్తమదుపయోగ మాళ్పనుస్వర పెడెయోళ్
గొత్తాద రాగ భావద
చిత్తా ర్షణె యమాళ్ప రసికను గమకి"

రాగ సాహిత్య భావములలో సమానతను సాధించువాడే ఉత్తమ గమకి కాగలడు.

కావ్యమందలి అర్థ భావ రసములను తీర్చించుకొని, ఆయా సన్నివేశాలకు, పాత్రలకు, రసభావాలకు తగిన రాగముల ఆరోహణ. అవరోహణ విధానాలను రాగము యొక్క ముఖ్యమైన స్థాయీ భావాల కనుగుణంగా, లలితంగా, మధురంగా గానం చేసి కవిని, శ్రోతలను మెప్పించు శక్తి కలవాడు 'గమకి'.

సామాన్యులకు అతి సామాన్యంగా కనిపించే విషయాలను కవి సుందరమైన కావ్యంగా సృష్టిస్తాడు ఆ కావ్యాన్ని మధురంగా గానం చేయటం అతనికి సాధ్యం కాకపోవచ్చు. ఆ కావ్యాన్ని మధురంగా, మనోజ్ఞంగా గానం చేసి కావ్యానికొక వైశిష్ట్యమును కల్పించే శిల్పి గమకి

గమకములో గజగమన, అశ్వగమన, కుక్కుట గమన రీతులున్నవి ఈ గమనములను, సన్నివేశ, పాత్ర, భావ, రసములకు అనుగుణంగా ఉపయోగించినపుడు విలక్షణమూ, వినూత్నమూ అయిన అర్థ భావ సౌష్ఠవాలతో వికసిస్తుంది. తన రాగ సుధా గమక సూత్రంతో, కవి నవరస యుక్తమైన భావ రత్నాలను గూర్చి సుందరమైన మాలను గుచ్చే ప్రతిభ గమకం నడక.

వీణలో వివిధ రాగ రసభావములున్నాయి. అవి వైణికుని కర విన్యాసంతో మాత్రమే బహిర్గతం కాగలవు. అట్లే కవి యొక్క కావ్యం గమకి యొక్క స్వర విన్యాసం లేనిదే పలకదు

గమకి మాంత్రికుడు వంటివాడు. శ్రోతల మనస్సులను ఆకర్షించి, కరిగించి రంజింపచేసి వశపరచుకుంటాడు

నాటకకర్త అన్ని పాత్రలు తానుగా నాటక రచన చేస్తాడు, కాని తాను అన్ని పాత్రలను అభినయించలేడు. 'గమకి'కి నాటకోపకరణములేవీ లేవు కాని మధురమైన ధ్వని విన్యాసంతో అన్ని పాత్రలూ తానుగా, ఆయా పాత్రల రసపోషణం కావించి శ్రోతల మనోనేత్రాల ముందు శ్రవ్య కావ్యాన్ని దృశ్య కావ్యంగా రూపొందించగలడు. చెవులను కన్నులుగా మార్చగలడు '

—శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## సాహిత్య సర్వస్వ కల్పవల్లిమ తల్లి!

అమ్మ, కలగూరగంపా! నీవు సాహితికి
ఎనలేని సేవ చేసితివి; చేయుచుమంటి;
ఎందరో క్రొత్త రచయితల కనుగొనుచుంటి;
నీవొక అమూల్య భూషణమిమ్మ, భారతికి'

నీ విముద్రించుకొనంగ లేనట్టి విషయమ్ము
లేదు లోకమునందు! పెద్ద పెద్ద వ్యాసమ్ము
లవుడప్పు డగుచుండునమ్మ - నీ గ్రాసమ్ము!
నానావిధ చర్చలకు నీవు నిలయమ్ము!

నా వంటి సామాన్యు లెందరో నీ మూల
మున రచయితలుగాగ మలచబడిరో తల్లి!
సాహిత్య సర్వస్వ కల్పవల్లిమతల్లి!
అందుకై మోకరిల్లితినమ్మ, నీ ముందు.

ఎల్లప్పుడును కూడ ఇట్టులే నీ చేత
క్రొంగ్రొత్త రచయితలు మలచబడుదురు గాక.

—కలగూరగంటి రంగాచార్యులు

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము





NON—MEDICINAL

AMRUTANJAN
LTD'S

CASTOR
OIL

SUPERIOR
PURE REFINED
AND ODOURLESS






అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004



Amrutanjan Limited

సమానము. (రాజకన్య - రాచకన్నె కావలెను) పరిశీలకులు పీఠిక (53 పుట) యందు గ్రంథనామ ఔచిత్యమును గూర్చి తెల్పుచు "రాచకన్యకా పరిణయము' అని లేఖక ప్రమాద జనితముగా భావింపవచ్చును" అని తెల్పినారు. తరువాత వీరే పోతనగారి 'దానవ రాచూలు' వంటి ప్రయోగముల వంటిదే 'రాచకన్యక' అనినారు. ఇట్టి వీరి సమర్థన కేవలం స్వయం సంతృప్తిగనే యుండును. లభించిన ఏకైక ప్రతిని యథోచితముగా సంస్కరించి దీనికొక ఆకృతి కల్పించిన బాలసుబ్బయ్యగారు పేరును కూడా రాజకన్యకా పరిణయమని మార్చి గ్రంథనామ విషయ చర్చలో తెల్పిన సమంజసముగా నుండెడిది. పుస్తక పరిష్కరణమున కవి పాఠములను ప్రయోగముల తెల్పి, వానికి చేసిన యుక్త పాఠ సూచన మొనర్చుట ఒక పద్ధతి ఈ విషయమున (రాచకన్య....) సంపాదకులు చొరవ చూపవలసి యుండెను

ఛందో వ్యాకరణ వైశిష్ట్యము, విసంధులు, స్వతంత్ర ప్రయోగముల గూర్చి (165 – 182 పు) విపులముగా తెల్పిన పరిష్కర్త. వీనిలో కొన్ని పదాలకు ఇతరుల ప్రయోగముల కూడా పేర్కొనినచో వాని ప్రాధాన్యము తెలిసెడిది. తెలంగాణమున క్రీ.శ. 1800 ప్రాంతము నుండి వచ్చిన రచనలలో అనేక వ్యావహారిక, మాండలిక, అన్యభాషా పదము లున్నవి. కొన్నిటికైనా సమన్వయ పరచుట పరిశోధక రీతి. ఉదా:- ఈ గ్రంథమున చెవులు (3-203) 'చెవులు' అనుటకు. ఈ పదము కాలాంక సందిపీ పరిణయము, కేశవస్వామి శతకము, క్షత్రబంధూ పాఖ్యానముల యందు కలదు. ఇట్లే అచ్యుత పదము ప్రాస కొరకు 'అచ్యుత' (3 124) యైనది. మత్స్య-మచ్చ (2-403) యైనది. ఇట్టి పదాలు తెలంగాణ రచనలలో కన్పడును. ఈ విధమైనవాని వివరముల చర్చినచో విషయ సమగ్రత ఏర్పడును.

బాలసుబ్బయ్యగారి పరిశీలనమున కనుమరుగైనవో! లేక వారే విసర్జించిరో? తెలియదు కాని మరికొన్ని పదముల గూర్చి- (బ్రాకెట్లులోని సూచన నాది)

వతరించి (1-131) 'అవతరించి' అను అర్థమున కలదు. పద్యము 'రైవత' 'పేరైవతరించి' - ఇట్లు ప్రాస ఘటితము దీనివలన 'శబ్ద చమత్కారముగా 'వతరించి' తప్పు లేదు

పెనగ (1-86) 'పెనగ పూర్ణంబు పెట్టిన భక్ష్యముల తోడ' అని. ఇచ్చట 'శనగ' కావలెను. యతి కుదురును.

కు-చోద్యము (2-87-92) చోద్యమునకు కవి 'కు' చేర్చి నాడు. యతి స్థానమున పడినది.

బోసేసి (3-19) ఇది 'బోంచేసి' కావలెను. జన వ్యవహారము కూడ ఇదే!

బికలికుచ్చుల (3-12) ఇది 'పికిలి' శబ్దము.

అక్షోహిణి (2-255-260) 'అక్షౌహిణి' కదా! ముద్రణ ప్రమాదమా?

కనవిప్పక (2-42) (కనసీయక) లంబయిన్న 2-153 (అందచేయ) ధర్మముల్నారసి 3-43. (ధర్మముల్ గాంచుచు)- అని మార్పుల సూచింపవలసినది.

2-308 'ఏమోను పురములు విద్లుం-సాయకములు'. దీని 'విల్లుల' అనవచ్చు.

3-16 మత్తకోకిల ప్రథమ చరణమున యతి స్థాన గణములు ఉత్తమైనది

3-142 'సేవలు' ఇది సేవియ చూపాంతరము 'సేవెలు' కావలెను. 'అనుకు వెన్నెల దాల్చి తునిచి సేపెలు చేసి' (యయాతి చరిత్ర) 'తెగిన జందెములేల దెచ్చెదరన గావు వినుడి విసన్న సేవియలు గావి (జైమిని భారతము)

2-411 యూరాలు:- వాడుకలో 'యేరాలు' అధికము. 'ఏరాలు' సరిపదము 'ఏరాలి పట్టి బిత్తెత్తి చెక్కిలి నొవ్వగజుదు వాడేద్చినగ గొణిగిలించి' (పాండురంగ....) కవి పూర్తిగా వాడుకలోని 'యూరాలు' మనినాడు.

4-50 అప్సరలు:- అప్సరసలు. అచ్చరలు కావలెను. అప్సర శబ్దము గదా!

ప్రాచీన సాహితీ ప్రబంధ పరిష్కరణమున క్రమించిన సుబ్బయ్యగారు దీనిలో అర్థానుస్వార, శకటరేఫల నెందుకు తొలగించిరో? అని లేకపోవుట వీరికి సమ్మతమైతే కావచ్చు కాని, వీని వలన కొన్ని పదాలకు అర్థపుష్టి అర్థ వివరణ ఏర్పడును వీనిని వదిలినవారు 'ఁ' (1-114)ను గ్రహించుట వింతగా నున్నది.

లభించిన ఒక్క ప్రతిని ఆధారము చేసికొని - శ్రీమతి యశోదారెడ్డిగారు పర్యవేక్షణమున పరిశ్రమించి, ఎంతగానో విషయ వివేచన మొనర్చిన బాలసుబ్బయ్యగారి కృషి శ్లాఘాపాత్రమనుటలో ఎట్టి విప్రతిపత్తి లేదు.

సాహితీకులు చదివి ఆనందించి అభినందించవలసిన గ్రంథములలో ఇది యొకటి.

# భాగవత కథాతత్త్వము

[రచన-కపిలవాయి లింగమూర్తి, పుటలు-300, ధర-50/- ముద్రణ-5-9-89, ప్రతులకు - శ్రీ కళాలయము, 15-34 వాణి నగర్, విద్యానగర్ కాలనీ, నాగర్ కర్నూలు - 509 209 మహబూబ్‌నగర్ జిల్లా]

భారతీయులకు రామాయణ, భారత, భాగవతాలు ముఖ్య పేటికలు పారాయణ గ్రంథాలు. వీటిని గూర్చి ఇతర సాహిత్య విషయములుంచి, తెలుగు సాహిత్యంలో పరిశీలిస్తే అనేక విధములుగా ఎన్నో రచనలు వచ్చినవి, వస్తున్నవి. దీనికింతా ముఖ్య కారణం ఆయా గ్రంథాలపై మనకున్న గౌరవ భావమే.

భాగవతమును తెనిగించిన వారున్నారు. దీనిపై పరిశోధనలు చేసినవారు, ప్రత్యేక విమర్శలు వ్రాసినవారున్నారు. తెలుగువారు పోతన భాగవతాన్ని పురాణంగా, ధర్మ ప్రవచన గ్రంథంగా భావిస్తారు. అందుకారణమే చిన్న పెద్ద రచనలు వస్తున్నవి.

బహుగ్రంథ నిర్మాతలు, కవి - పండితులైన కపిలవాయి లింగమూర్తిగారు తెలుగు భాగవతాన్ని కూలంకషంగా పఠించి, పరిశీలించి, వేదాంత - ధర్మశాస్త్ర - సాంఖ్యాచార - విజ్ఞానశాస్త్ర దృష్టితో సునిశిత పరిశీలన మొనర్చి సిద్ధం చేసినది ఈ 'భాగవత కథాతత్త్వం' అవతార తత్త్వం భాగవతానికి మూలభూతమనది కాబట్టి గ్రంథం పేరులో 'తత్త్వ' చేరింది. కాక అవతార సంఖ్యానుగుణంగా 10 కథలు విభజింపబడినవి. అవి- 1) [illegible] 2) [illegible] 3) [illegible] 4) అజామిళోపాఖ్యానం 5) నారాయణ కవచం 6) ప్రహ్లాద చరిత్ర 7) గజేంద్ర మోక్షణ 8) వామన చరిత్ర 9) గోపికా [illegible] 10) రుక్మిణీ కల్యాణం - అనేవి [illegible] ఒక వేదాంత కథతో ఆరంభించి కల్యాణంతో ముగించటం కల్యాణాత్మక [illegible] కథా ప్రవచన పద్ధతి

[illegible] గమూర్తిగారు ప్రతి విషయానా అనేక ఉపపత్తులతో పరిశీలించి మెరుగుపరచడే గాక - ఆధ్యాత్మిక, వేదాంత విషయాలను, శిత్త్వాలను ప్రతి దగ్గర జాబితాగా ఇచ్చి వారి కీ గల సర్వంకష ప్రతిభను నిరూపించినారు. అటిల వేదాంత విషయాలు ఈ పద్ధతి వలన సులభగ్రాహ్యంగా మారినవి. 55 పుటలో నవద్వార పురం, పురంజన రూపం మొదలైన కాటికా 59 పుటయందు రామాయణ, భారత పాత్రలకు ఆధ్యాత్మికారోపం, 74 పుట భరతోపాఖ్యానంలో పూర్వజన్మ జ్ఞానం గూర్చిన అత్యాధునిక సమాధానం. 126 పుట నారాయణ కవచ విశేషాలు, మంత్రం, పూజా యంత్రం 132 పుట, గృహస్థు పూజించవలసిన దేవతలు 165 పుట. ప్రహ్లాద చరితలో విద్యాపద్ధతి - ఉపాధ్యాయ లక్షణం 257 పుట, శ్రీకృష్ణుని అష్టమహిషులు వారి వివరాలు - వీరిని గూర్చి వచ్చిన తెలుగు సాహిత్యం - ఇట్లా కథలకు ఇహపరవిష యాలను సమన్వయపరచి చెప్పినారు. ఇదొక నూతన పద్ధతి. ఒక విధంగా యిది పరిశోధనాత్మక రచన.

వీరి [illegible] రీతి సులభ వ్యావహారికంలో చక్కగా సాగింది. అయితే 28 పుటలో శ్రీపాదవారి జనకకాల పూర్వ విశేషాలు, 73, 74 పుటల్లోని ఫుట్‌నోట్స్‌కు ఆధారాలేమీ తెల్ప లేదు. ఇవి చాలా ముఖ్య విషయాలు కాబట్టి ఇట్లా వదలటం ప్రమాద ఎతితమే - ప్రతి చిన్న విషయం ఏ పత్రికలో ఎప్పుడు వచ్చిందో తెల్పిన గ్రంథకర్త కొన్ని విషయాల్లో ఆకరాల నీయటం విస్మరించినారు.

ఈ పుస్తకాన్ని చదివినవారికి లింగమూర్తిగారి సంస్కృత, ఆంధ్ర భాషా వైదుష్యం, జ్యోతిష, వేదాంత, సాహితీ విషయాల్లో ఎంత పట్టు గలదో వ్యక్తమవుతుంది.

దీనికి అనుచేళం రాజేశ్వర శర్మగారు, బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు విపులమైన, విషయ స్ఫోరకమైన అభిప్రాయముల వెల్లడించినారు.

'భాగవత కథాతత్త్వం' పఠిస్తే సంపూర్ణ భాగవతాన్ని వివిధ దృక్కోణాల నుంచి పరిశీలించి పఠించినట్లవుతుంది. ప్రతి కథయందు లింగమూర్తిగారి కృషి ద్యోతమాన మగుచున్నది. ఈ గ్రంథము ప్రతివారు చదివి ఆనంది చదవలసినది.

నూతన పద్ధతిలో భాగవతాన్ని మన ముందుంచిన గ్రంథకర్త కృషి అభినందనీయ మనుటలో అతిశయోక్తి లేదు.

—డా॥ శ్రీరంగాచార్య

# కాకతీయ శాసనాలు ఆంధ్రభాషా పరిశీలన

[రచన - డా॥ ఎస్. ఎల్. ఎన్. ఆచార్య, వెల - 50/- గ్రంథాలయ ప్రతి - 60/- ప్రతులకు - 1) ఎస్. గాయత్రి, 3 - 51 పాత అల్వాల్, హైదరాబాదు - 500 010 2) తెలుగు పరిశోధన ప్రచురణలు, 1 - 1 - 694 / 2 / ఎ, గాంధీనగర్ హైదరాబాదు - 500 380]

శాసన పరిశోధన ఒక క్లిష్టమైన విషయం. శాసన లిపిని అర్థం చేసుకోవడం, శాసనాలలోని భాషా విశేషాలను పరిశీలించడం కష్టసాధ్యమైన కార్యం. అయినప్పటికీ ప్రతిభావంతులైన పండిత పరిశోధకులెందరో శాసనాలను పరిశోధించి, పరిశీలించి వాటిలోని చారిత్రకాది విషయాలనూ, భాషా విశేషాలనూ ప్రకటించి చరిత్రకు, భాషకు ఎనలేని ఉపకారం చేశారు. శాసనాల్లో శిలా శాసనాలు, తామ్ర (రాగి) శాసనాలు ముఖ్యమైనవి. రజత (వెండి) శాసనాలు కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. వీటిలో దాన శాసనాలు అధికం.

శాసన లిపిని తెలుసుకోవడం ఒక యెత్తైతే, శాసనాల్లోని భాషా విశేషాలను గుర్తించడం మరొక ఎత్తు. ఎందుకంటె ఈనాడు వ్యవహారంలో లేని ఎన్నో పదాలు, వాక్య నిర్మాణం నాటి శాసనాల్లో ఉండడమే కారణం. శాసన భాషను అర్థం చేసుకోవడానికి పాండిత్యమూ, ప్రజ్ఞా బలమూ చాలా అవసరం. ఈ రెండూ ఉన్న విద్వాంసులు డా॥ ఎస్. ఎల్ ఎస్. ఆచార్యగారు. డా॥ ఆచార్యగారు శ్రీ వేంకటేశ్వర వేదాంతవర్ధనీ కళాశాలలో విద్యాభ్యాసం చేసి పాండిత్యాన్ని సంపాదించారు వ్యాకరణ ప్రావీణ్యాన్ని అలవరచుకున్నారు. కనుకనే క్లిష్టమైన శాసన భాషా పరిశీలన సాగించి కృతకృత్యులైనారు

ఆచార్యగారు పి. హెచ్. డి పట్టం కొరకు సంతరించిన గ్రంథమిది. ఈ గ్రంథంలో పరిశీలన విషయాన్ని పన్నెండు ప్రకరణాలుగా విభజించారు. అవి 1) శాసనాలు - స్థాపనకు గల కారణాలు 2) కాకతీయ శాసనాలు - స్వరూప విషయాలు 3) కాకతీయుల తెలుగు శాసనాలు - సాహిత్యం 4) కాకతీయుల శాసనాలు - సంస్కృత భాషా సాహిత్యాల ప్రభావం 5) దేశ్య పదాలు 6) కాకతీయుల శాసనాలు - వాక్య నిర్మాణం 7) విశేష పదాలు - అర్థ విచారణ 8) అన్యభాషా పదాలు 9) అనంతర శాసనాలు - కాకతీయ శాసన ప్రభావం 10) కాకతీయ శాసనాలు - తెలుగు వ్యాకరణాలు 11) కాకతీయ శాసనాలు - వ్యావహారిక భాష 12) ఉపసంహారం.

మొదటి ప్రకరణంలో శాసన భేదాలు, శాసనాలు వేయుటకు గల కారణాలు, శాసనాలు వేసిన వ్యక్తులు మొదలైన విషయాలను హేతుబద్ధంగా చక్కగా వివరించబడినవి. రెండవ ప్రకరణంలో శాసన భాషను గూర్చి, శాసనాల్లో ఉపయోగించిన సంస్కృతాంధ్ర భాషల తీరు తెన్నులను గూర్చి తెలుపబడినది. అందులో పద్య గద్య శాసనాల వివరణ ఇవ్వబడినది. శాసన విషయాన్ని వివరిస్తూ ఎక్కువగా విషు సంక్రాంతి మొదలైన పుణ్య దినాల్లో దేవాలయాలకు దాన ధర్మాలు చేసిన అంశాలను గురించి నిరూపించడం జరిగింది. ఇంకా ఈ ప్రకరణంలో చరిత్ర, రాజ్య వ్యవస్థ, గ్రామ వ్యవస్థ, నాణెములు - కొలతలు మొదలైన అనేకాంశాలు వివరించబడినవి.

తెలుగు శాసనాలు - సాహిత్యం అనే మూడవ ప్రకరణంలో వర్ణనలు, అలంకారాలు, ఛందస్సు మొదలైన సాహిత్య విషయాలు సోదాహరణంగా తెల్పబడినవి. నాల్గవ ప్రకరణంలో కాకతీయ శాసనాలపై సంస్కృత భాషా సాహిత్యాల ప్రభావం, శాసనాల్లోని వాక్య నిర్మాణం, సంధులు, సమాసాలు, క్రియలు మొదలైన వ్యాకరణాంశాలు, అనే శీర్షిక క్రింద చూపబడినవి. ఇతర ప్రకరణాల్లో విశేష పదాలు, అర్థ విచారణ, అన్యభాషా పదాలు, అనంతర శాసనాలపై కాకతీయ శాసన ప్రభావం మొదలైన అనేక విషయాలు ఉదాహరణ పూర్వకంగా తెలుపబడినవి.

పదాల వివరణలో ఆచార్యగారు చూపిన తీరును గురించి ఒకటి రెండు ఉదాహరణలు ఇక్కడ చూపబడుతున్నవి.

మనాత్తి :

జీవనభృతి - మనవర్తికం, మనార్తిగా మారి ఉంటుంది. గాంగరాజైన వజ్రహస్తుని సంస్కృత శాసనంలో మనవర్తికం కనపడుతుంది. పెరూరు శాసనంలోని మనాత్తి జీవనభృతి అనే అర్థంలోనే (మనాత్తి కాణరూకలు) కనిపిస్తుంది నేటి వ్యవహారంలో కనిపిస్తున్న మనవర్తి, మనోవర్త అనిందు గ్రామ్యాలుగా శబ్ద రత్నాకర కర్త పేర్కొన్నారు

క్రొప్పించు :

తప్పించు. నేటి వ్యవహారంలో గొయ్యి, గొప్పు, కోపు అనే పదాలు నామవాచకాలుగా కనిపిస్తాయి. వీటిలో గొయ్యి, గొప్పు నిఘంటువులలోకి చేరినాయి. కోపులు తెలంగాణా మాండలికం. నేటికీ వినిపిస్తుంది. పై మూడు పదాలు క్రొప్పు లేక కొప్పు నుండి ఏర్పడి ఉంటాయి. క్రొప్పు ప్రాచీన రూపం. ఈ పదం ఉత్తూరు శాసనంలో కనిపిస్తుంది.

ఈ వివరణలు రచయిత ప్రజ్ఞా పాటవాన్ని, భాషానుశీలనాన్ని తెలుపుతున్నాయి.

అయా అంశాలను తెలపడంలో నరసింహాచార్యులుగారి సూక్ష్మ పరిశీలనా దృష్టి, విషయ విశ్లేషణ, వ్యాకరణ పాండితి గోచరిస్తాయి. ఆచార్యులుగారు క్లిష్టమైన విషయాన్ని పరిశోధనకు స్వీకరించి సఫలత నొందడం మిక్కిలి అభినందనీయం. ఐతే ఇందులో ఒకటి రెండు లోపాలు కూడా లేకపోలేదు.

కావున లిపిని గూర్చి కొంత తెలుపవలసి ఉంటేను. కొన్ని ప్రకరణాలలో శీర్షికాతిరిక్తమైన అంశాలు తెలుపబడినవి. ఇలాంటి లోపాలను మలి ముద్రణలో తొలగించుకొనగలరని ఆశిస్తున్నాను

రచనా శైలి శిష్ట వ్యావహారికంగా ఉండి పఠనకమై చదువడానికి ఉత్సుకతను కలిగిస్తుంది

—వేముగంటి

## చెంబులో చందమామ

[గ్రంథం పేరు - ఈ నగరం జాబిల్లి, గ్రంథకర్త- శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ, ప్రచురణ - శేషేంద్ర సాహిత్య పీఠం, జ్ఞాన్‌బాగ్ పేలెస్, 'షా మహల్, హైదరాబాద్ - 12, 1/4 క్రౌను, పుటలు మొత్తం 76, వెల - పది రూపాయలు.]

'ఈ నగరం జాబిల్లి' అనే శేషేంద్ర గ్రంథం - మజిల్ లక్ష్య లక్షణ సమన్వయ కరపత్రం! ఇంకా అభిమానంతో చెప్పదలిస్తే - ఒక చారిత్రిక సమాలోచనా వ్యాసం

నడుమ నడుమ కొన్ని వాక్యాలు కవిత్వం వలె భాసిస్తున్నంతమాత్రంలో గాని, మధ్యే మధ్యే రచయిత సందర్భేతరంలో రచించిన కవితలు జొనిపినంత మాత్రంలో గాని - దీనిని గీతి కావ్యం అనడం దబాయింపే! ఇన్నర్ టైటిలు క్రింద వివరణాత్మక వాక్యంగా రచయిత స్వయంగా అన్నంత మాత్రంలో - ఆ మాట చెల్లదు. ఈ రచయితకు ఇటీవల కానేం చేసినా నమ్మేలా సంపిద్ధంగా ఆమోదిస్తారనే స్వాతిశయం ప్రబలింది కానేది రాసినా అందరూ హర్షించి తీరతారనే అహమిక పెరిగింది. ఫలప్రసిద్ధితో చెట్టయితే ఒంగుతుంది పాండిత్య భారంతో మనిషి గిడసబారితే శేషులం పెరుగుతుంది. పెరుగు పెరుగుతుంది; బౌనితీ విదారణకు వ్యాప్తి పలికి - వీరాంగం త్రొక్కుతూంటే ఆశించిన సద్భావఫలితాలు భిన్నమవుతాయి'

అసలు విషయానికి వస్తే ఈ పుస్తకంలోని పది ప్రకరణాలూ దాదాపు స్వగతంగా సాగాయి. తొలి 'చరిత్ర' ప్రకరణం లోని మొదటి వాక్యమే అచారిత్రక వక్రీకరణతో సాగింది. "దక్కన్ పశ్చిమాకాశం పూచే గులాబీ సంధ్యల్లో నాలుగు బాహువులెత్తి మనల్ని పిలుస్తున్న ప్రేమ చిహ్నం చార్‌మినార్! అశ్విక సైన్యాలతో, ఖడ్గ సమూహాల సంఘర్ష ధ్వనులతో, యుద్ధ కోలాహలంతో నిండిన ఉత్తర భారతాన్ని హిందూస్తాన్ తన రాజ్యతంత్ర మందిరం చేసుకుంటే - దక్కన్ పీఠభూమిని చాందినీ రాత్రులతో, సితార్ సారంగీ తంత్రీస్వర మాధుర్యాలతో నిండిన ప్రణయ మందిరంగా చేసుకుంది" అనడం అవిచారపూరితం. మొగల్ పాలకుల ప్రతినిధులుగా వచ్చి, దక్కన్ పీఠభూమిని ఆక్రమించి గోల్కొండను రాజధానిగా పాలించినవారం తించిన దాదిగా నిజాం చక్రవర్తులు మానవ రుధిర కాసారంలోనే యాదులాడారు అంతఃపుర షరాబీ భూయువాసనల మాదకత్వంలో మానవత్వం దారుణ మారణ హోమానికి గురయింది. తమ పీడకలల నుంచి కృతక శాంతిని పొందడానికే తంత్రీ స్వనాలలో తబలా మోతలలో మునిగిపోయారు. పీడిత ప్రజల హృదయ ధ్వానాలు వినిపించకుండా జాగ్రత పడ్డారు. మూడు భాషా ప్రాంతాల ప్రజానీకాన్ని వారి సంస్కృతినీ కాలరాశారు.

ప్రకరణంతో ప్రారంభమైన చారిత్రక సమాలోచన పాక్షిక సత్యాలను సమగ్ర సత్య స్వరూపాలుగా భాసింపచేస్తూ ఎంత దూరమైనా సాగిపోతుంది. చెంబులో చందమామను చూపి, అదే చంద్రమః కళాపూర్ణ బింబ మనుకోమని దబాయిస్తుంది. ఆద్యంతమూ యీ గ్రంథం పాఠకులను అలాంటి భ్రమలోనే కప్పి వుంచడానికి ప్రయత్నించింది.

భాగ్యనగర ప్రాదుర్భావానికి భాగమతీ కులీ కుతుబ్‌షాల ప్రణయగాధ ప్రథమ ప్రేరణగా నిలవవచ్చు గాక! అంతమాత్రంలో ఆ నగరమే ప్రేమామృత సాగరమైపోయిం దనుకోమంటే— చరిత్ర సాక్ష్యం పలకదు. నర రక్త కల్లోలిని చరిత్ర పుటల లోంచి ఘోషిస్తూనే సాక్షాత్కరిస్తుంది. యథార్థాలను విస్మరించి ఒంగొమ్ముగా సంకీర్తన సాగిస్తే ఫలితార్థం మృగ్యమే!

కులీ కుతుబ్‌షా ప్రేమికుడు, కవి, ఘజల్‌కు ఆద్యుడు. ఏభయి వేల కవితలు రచించాడట! మరెన్నో కొత్త ప్రక్రియలకు ఆరంభకుడయ్యాడు ఎందరో కవులను పోషించాడు భాగ్యనగరు నిర్మించాడు

కాని అతని తండ్రి మహా క్రూరుడు తన కిష్టంలేని హిందూ కన్యని ప్రేమిస్తున్నాడన్న ద్వేషంతో కొడుకుని ఖైదులో పెట్టాడు మతాతీత వ్యక్తిస్వేచ్ఛ ఎన్నడూ గుర్తింపబడలేదు. రాజవంశాల క్లిష్టతర జీవితానికి, అమానుషత్వానికి మతం ముసుగు కప్పబడింది

కులీ కుతుబ్‌షా అక్బర్ పాదుషాకు సమకాలికుడు తండ్రి మరణానంతరం రాచమర్యాదల్ని అతిక్రమించి సామాన్య భాగ్యమతిని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పేరున హైదరే మహల్ నిర్మించాడు.

ఆ ప్రేమ చిహ్నంగానే హైదరాబాద్‌గా నామకరణం చేశాడు. అతని తీయని కల పరంపరాభివృద్ధి కాంచింది. నాలుగు వందల ఏళ్ళ చరిత్రలో దాని అభివృద్ధి ఒక ఎత్తయితే - గత నలభై సంవత్సరాలలోనూ రెండింతలైంది. ఈ నగరం చక్రవర్తి ప్రేమాయణ ప్రతీకగా నిలచింది

ఇబ్రహీం షా హైదులో ప్రస్తుతున్న కులీ కుతుబ్ మిత్రులతో సమాలోచించి, కటకటాలు ఊడబెరికి, బయటపడ్డాడు. ఎడతెరిపిలేని వాన కురుస్తోంది. మిత్రులతో కలసి గుర్రాలపై దాడు తీశాడు. మూసీ నది పొంగి పొర్లుతోంది ఈది అవలి ఒడ్డుకు చేరుకున్నారు. తండ్రి కంట పడకుండా చెంచలం గ్రామానికి పారిపోయి భాగ్మతిని కలుసుకున్నాడు కులీ కుతుబ్ అజ్ఞాతవాసంలో ఉండగానే తండ్రి ఇబ్రహీం చనిపోయాడు రాజ్యానికి వచ్చి కులీ కుతుబ్ సింహాసన మధిష్ఠించాడు భాగ్మతిని వైభవంగా పెళ్ళి చేసుకున్నాడు.

చారిత్రక కథనంతో ఒక రచన చేస్తున్నపుడు కాలక్రమ దృష్టి తప్పనిసరి. 17వ శతాబ్దికి చెందిన రామదాసు (కంచర్ల గోపన్న) గాని, 19వ శతాబ్దికి చెందిన గాలిబ్ గాని కులీ కుతుబ్ కాలానికి తెలిసే అవకాశం లేదు. కాని (13వ పుట) వెన్నెలమంటతో ప్రేమ కాచుకుంటున్న భాగ్యనగర్ ప్రజలు పాడుకుంటున్న పాట - "అల్లాకు అర్పిద్దాం మల్లెపూలు"లో ముందు గాలిబ్, వెనుక రామదాసు అనవసరంగా ప్రవేశించి అరాలు చేశారు!

చారిత్రక రచనకు ఎనక్రోనిజం బాధితీతంగమే. ఆనాటి ప్రజలలో మత సామరస్యం ఎంత ఉందో పాలకు లెంతగా ఉండనిచ్చారో తెలియదు. "మతాలలోని మతలబులను మట్టిలో కలుపుదాం!" అదే పాటలో ప్రజలు పాడుకున్నారంటే మాత్రం నమ్మశక్యం కావడం లేదు. ఏమైతేనే కులీ కుతుబ్ ఒక స్వర్ణయుగాన్నే నెలకొల్పారని మనం విశ్వసించడంలో ప్రమాదం ఉండదు

గజల్ ఒక ఆయస్కాంత విద్య అనే మూడవ ప్రకరణంలో రచయిత సంయమం కోల్పోయి స్వీయ వైభవ కీర్తనం కావిస్తాడు. మహాకవి ఫెయిజ్ అహ్మద్ ఫెయిజ్‌తో తనకు గల అనుబంధాన్ని విస్తరిస్తాడు. తాను ఒక కోతి బొమ్మ వేయ వూనుకున్నాడు. శ్రద్ధగా కోతి బొమ్మనే వేయాలి. తన బొమ్మ పేపి క్రింద కోతి అని రాయకూడదు. గజల్ రెక్కలపై పావం కాలజ్ఞానం ఎంత దూరం పారిపోయిందో? అంతే - ఈ నగరం గాలిబ్లతో సంబంధాలు త్రెంచుకున్న గజల్ చరిత్ర నాటి నుంచి నేటిదాకా రేఖామాత్ర శేచర మార్గమైపోయిందనేనా?

2

తొలుత చంద్రుణ్ని వేలెత్తి చూపించాడు గ్రంథకర్త. పిదప ఆ వేలు గురించి చర్విత చర్వణ సాగించాడు. చివరికి చందమామను చెంబులో చూపించి సంతృప్తి చెందమన్నాడు.

గజల్ ఒక అగ్ని, ఒక సంస్కృతి, అందమూ ఛందమూ వగైరా ప్రకరణాలలో తనకు తెలిసిన సంగతులూ, సొంత ఊహాపోహలూ నింపాడు మధ్యే మధ్యే ప్రకుచ మర్దనాలు! మొత్తానికి గ్రంథ రచనను సావధానంగా రూపొందించుకొన్న ప్రణాళిక కనిపించదు. వ్యక్తావ్యక్తాలాపాలు మితిమీరాయి! కుప్పక్రియాలూ శూన్య వాక్యాలూ లభించాయి దీనికి కారణం ఏమిటి?

ఏ గ్రంథ రచన అయినా ఎవరిమీదో అక్కసు వెళ్ళబుచ్చుకుందుకే ఉద్దేశించబడితే ఫలితం యిలాగే అరకొరగా మిగులుతుంది! స్వీయ ఘనత ప్రదర్శించుకుందుకు ప్రయత్నిస్తే అరణ్యక చిత్తవృత్తిని ఆవిష్కరిస్తుంది.

గజల్ ఒక సంస్కృతి అనే ప్రకరణంలో - ఉరుదూ కవులందరూ ప్రజల దైనందిన జీవన శకాలన్నిటిలోనూ ప్రవహిస్తూంటారనే సత్యం విస్మృతమైంది. 'ఉరుదూ సంస్కృతికి పునాది ఖురాన్ కాదు; గజలే!" అనే వక్కాణింపును ఆ భాషా పండితు లెంతవరకూ ఆమోదిస్తారో మరి?

అందమూ ఛందమూ అనే ప్రకరణంలో గజల్ నిర్మాణ శిల్ప రహస్యాలు ద్యోతకం మవుతాయి. ఒక ప్రఖ్యాత కవి- గజల్ సంప్రదాయాన్ని అనుసరించి తెలుగు గజళ్ళు రాసి, స్వయంగా పాడి రికార్డు చేశాడన్న ఉక్రోషంతోనే ఈ గ్రంథ రచన ప్రారంభమైంది. ఆ ద్వేషావరణంలోనే పెంపొందింది. అందుకే యీ గ్రంథం నుంచి ఏ ఉత్తమ నిర్దేశమూ మనకందడం లేదు పైగా తెలుగు గజళ్ళ కవిపై ఈ గ్రంథకర్త మనసులో మరగిన ద్వేషాన్ని దాచుకోలేకపోయాడు. వాచ్యంగా యిలా అన్నాడు : "గజల్‌కు వాస్తవంగా తెలుగులో మొలకెత్తడానికి అనుకూలమైన నేల కాదు. రాసేవాడి సంస్కారం కూడా గజల్ జన్మకు అనువైన ఊహానీ శబ్దాన్నీ సృజించగల నాజూకు సంస్కారం అయివుండాలి!" తెలుగులో గజళ్ళు రాసిన కవికి నాజూకు సంస్కారం లేనేలేదని ధ్వని! అలాంటిదేదైనా కావలసి

వస్తే తనదగ్గరే బోలెడు ఉందనీను. ఉరుదూ భాషకు వైశిష్ట్యంగా ఉన్న సౌకర్యాల గురించి మరో ఏడు పేజీలు రాశాడో లేదో - మళ్ళీ యిలా అన్నాడు : "ఈ సౌకర్యాలేవీ లేని అన్య భాషల్లో గజల్ రాయడమే కష్టం! మెప్పించడం అనే ప్రశ్నే లేదు.... మోసం మాత్రం చెయ్యవచ్చు; పాటంగా ఒక అజ్ఞాన పాఠక లోకం దొరికితే!"

ఇక చూస్కో. గజల్ రచనలో స్వీయపాత్రను వెల్లడిస్తూ—"ఈ సాధనాలు కొంతవరకూ ఉన్న నేను ఒకప్పుడు గజల్ రాయడానికి ప్రోత్సహించబడ్డాను. కాని ఒక దశలో గజల్ గొంతు నలిగిపోతుందేమోనని భయపడ్డాను. ఆ ప్రయత్నం విరమించాను." తన ఋజుప్రవర్తన గురించి భుజ కీర్తులిచ్చుకున్నాడు. ఈ మాటల అంతరార్థమేమంటే - అలాంటి విడియాలూ సంయమాలూ లేని అల్ప సంస్కారులు తెలుగు గజల్ రచన తెగబడ్డారని!

తాను లోగడ ప్రచురించిన కావ్యాలలో గజల్ పోకడలను ఎలా వాడుకున్నదీ సోదాహరణంగా ప్రదర్శించాడు. కాని వాటికా లక్షణాలెలా పట్టాయో వివరించలేదు. దోష దృక్కూ, ద్వేష వాక్కూ ప్రగల్భిస్తే, రచయిత దర్పణమే గ్రస్తమైపోతుంది. తెలుగులో గాలిబ్‌ను పరిచయం చేస్తూ మూడు దశాబ్దాల క్రితం డా॥ దాశరథి ప్రచురించిన గ్రంథంలో - దాశరథీ, డా॥ బూరుగుల రామకృష్ణారావుగారూ గజల్ పుట్టుపూర్వోత్తరాలనూ లక్షణాలనూ చక్కగా విశదపరచి ఉన్నారు. అలాంటి సత్ఫలితం ఈ గ్రంథానికి లభించలేదు.

కవిత్వము - అవగాహన; ఛందస్సు : కవిత్వ ఆయుస్సు; వచన కవిత ఒక ప్రత్యేక పర్యవేక్షణ అనే మూడు వ్యాసాలూ సార్వత్రికంగా కవిత్వానికి నైసర్గిక లక్షణమైన ఛందోధారావిష్కరణ విపులీకరించాయి. కనుక గజల్ ప్రసక్తికి ఆనుషంగిక సంబంధాన్నే కలిగిస్తాయి. ఈ గ్రంథ సమగ్ర స్వరూపానికీ, గ్రంథానికి ఉంచిన గీతి కావ్యమనే ఉపమానానికీ సాంగత్యం భంగపడుతూనే వుంటుంది

—సోమసుందర్

## వివేకానందుని సామాజిక రాజకీయ దృక్పథాలు

[రచయిత : మూలం - వినయ్ కె. రాయ్, అనువాదం - కె. రాజేశ్వరరావు, యం. సారథి, 1/8 డెమ్మీ, 75 పుటలు, ప్రథమ ముద్రణ - ఆగస్టు 1988, వెల - రూ. 6-00లు. ప్రచురణ - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు, ప్రతులకు - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంకు స్ట్రీటు, హైదరాబాదు - 500 001]

స్వామి వివేకానందుడు భారతజాతి పునరుజ్జీవన వైతాళికులలో ఒకడు. భారతీయ తాత్వికతను ప్రపంచానికి చాటి చెప్పిన మొదటివాడు. వివేకానందుడు కేవలం వేదాంతి కాదు. ఆయనకు విశిష్టమైన సామాజిక రాజకీయ దృక్పథాలున్నాయని, మార్క్సిస్టు గతి తార్కిక సూత్రాల స్థాయికి ఆయన చేరుకోలేకపోయినా, సోషలిజానికి దగ్గరి దగ్గరికి ఆయన భావ ధోరణి వచ్చినట్లు ప్రస్తుత గ్రంథకర్త వివేకానందుని మార్క్సిస్టు స్టీలు చట్రంలో ఇరికించ ప్రయత్నించినాడు. తాను సోషలిస్టు అని ప్రకటించుకొని వివేకానందుడు బ్రతికిపోయినాడు. శూద్రుల గురించి వివేకానందుడు వెలిబుచ్చిన భావాలకు గ్రంథకర్త చాల ప్రాముఖ్యం ఇచ్చినాడు. ఎందుకంటే శూద్రులు అధిక సంఖ్యాకులు, శ్రమజీవులు. కమ్యూనిస్టుల "ప్రొలిటేరియట్" వీరే. శూద్రుల ప్రాముఖ్యాన్ని వివేకానందుడు ముందు గుర్తించలేదు. చంద్రగుప్త మౌర్యుడు రాజు అయినప్పటి నుండి భారతదేశంలో శూద్రులే ప్రధానంగా పాలకులైనారు. కలియుగంలో స్త్రీ, శూద్రులకే ఎక్కువ ప్రాముఖ్యం అని వ్యాసుడు "విష్ణుపురాణం"లో అంటాడు. వ్యాసుడు గంగలో మునుగుతూ, పైకి లేస్తూ, మునులతో కలియుగం ధన్యమైంది, శూద్రులు ధన్యులు, స్త్రీలు ధన్యులు అని ఎలుగెత్తి చాటుతాడు.

కలిః సాధుః కలిః సాధుః సాధు సాధ్వితి శూద్ర ధన్యోసిచ
యోషితః సాధు ధన్యాసి, తాభ్యోధన్యతరో స్తికః

అని ఘోషిస్తాడు. ఆధునిక పరిభాషలో చెప్పవలెనంటే నేటి కాలంలో శూద్రులకు, స్త్రీలకు ఆధిక్యం ఎక్కువుంటుంది అని అర్థం

"తనను తాను సోషలిస్టుగా బహిరంగంగా ప్రకటించిన, శ్రమజీవులైన శూద్రులు పాలకులుగా వుండే నూతన శకం ఆరంభిస్తుంది అని సాహసోపేతంగా ముందుగానే చెప్పిన ప్రథమ భారతీయుడు వివేకానందుడు" అని గ్రంథకర్త పుస్తకాన్ని ముగిస్తాడు.

—పర్దేశాయి తిరుమలరావు

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247

# స్వాస్

## మింట్స్




అమృతాంజన్ లిమిటెడ్

వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited**